సంపూర్ణ టాల్‌స్టాయ్ సాహిత్యం
12 సంపుటాలలో వెలువడింది.

# పిచ్చివాని జ్ఞాపకాలు

ఇవాళ నన్ను శాస్త్రి గవర్నమెంట్ బోర్డుకు తీసుకుని వెళ్ళారు. తలా ఒక అభిప్రాయం చెప్పారు. త్వరలో ఒక అభిప్రాయానికి రాలేదు. చాలాసేపు తగాదాపడి చివరకు నాకు పిచ్చిలేదని నిశ్చయించారు. వాళ్ళు ఈ నిర్ణయానికి రావడానికి కారణం వాళ్ళు నన్ను పరీక్ష చేస్తున్నంతసేపూ నేను ఎంతో నిగ్రహంతో ఉండగలగడమే. నేను పల్లెత్తు మాటకూడా అనవసరంగా మాట్లాడకుండా ఎంతో నిగ్రహంతో ఉన్నాను. అదీ కాక, నాకు పిచ్చాసుపత్రి అంటే చచ్చే భయం.

నాకు పిచ్చి లేదనీ, నేను కొన్ని భ్రాంతులకుమాత్రం లోనవుతున్నాను, కాని నా మనస్సేమీ చెదిరిపోలేదని నిశ్చయానికి వచ్చారు.

వాళ్ళు అలాంటి నిశ్చయానికి వచ్చారు కాని, నేను పిచ్చివాణ్ణని నాకు తెలుసు. ఒక డాక్టర్ నాకోసం ఒక ట్రీట్‌మెంట్ చెప్పాడు. ఆ ట్రీట్‌మెంట్ ప్రకారం నడుచుకుంటే నా మనోవ్యాధి పూర్తిగా నివారణ అవుతుందని చెప్పాడు. నా మనోబాధ నివారణవుతే చాలు—ఎలాంటి త్యాగమైనా చెయ్యడానికి సిద్ధంగా ఉన్నాను నా మనోబాధ భరించరానంత తీవ్రంగాఉంది. అసలు ఈ మనోవ్యాధి ఎలా ప్రారంభించిందో, నాకు పిచ్చెలా ఎత్తిందో, నన్ను నే నెలా మోసం చేసుకున్నానో చెబుతాను.

ముప్ఫయి అయిదవ సంవత్సరం వరకు, నేను ప్రపంచంలో అందరూ ఎలా జీవిస్తారో అలాగే జీవించాను. నాలో పెద్ద విచిత్రమేమీ లేదు. నా బాల్యంలో – అంటే నాకు పదేళ్ళుకూడా నిండక పూర్వం ఇలాటి అవస్థ అప్పుడప్పుడూ ఉంటూ ఉండేది. ఎప్పుడైనా మూర్ఛలు వచ్చేవి. కాని ఇప్పటిలా వరసగా వచ్చేవి కాదు. ఎప్పుడైనా సకృత్తుగా వచ్చేవి. ఒక మాటు——నాకు బాగా జ్ఞాపకం ఉంది– నా అయిదో సంవత్సరంలోనో ఆరో సంవత్సరంలోనో అనుకుంటాను – నేను నిద్రపోవడానికి పడుకోబోయేముందు – నా నర్సు యుప్రాక్సియా నా బట్టలు మార్చి మరో బట్టలు తొడుగుతోంది. యుప్రాక్సియా పొడుగ్గా సన్నగా ఉంటుంది. గోధుమరంగు డ్రెస్ వేసుకుంది. టోపీ పెట్టుకుంది. గడ్డం కింద ముడతలు పడుతున్నాయి. నన్ను పడుకోబెట్టడానికి యుప్రాక్సియా నన్ను ఎత్తుకుంది.

'నేనే పడుకుంటాను. నేనే పడుకుంటాను, అంటూ పక్కలో పడుకోబోయాను

'సరే పడుకో. పడుకో ఫెడ్యా! మిట్యా చూడు – మంచి పిల్లాడిలా ఎలా నిద్రపోతున్నాడో' అన్నది యుప్రాక్సియా నా తమ్ముణ్ణి చూపిస్తూ. నేను పక్క మీద పడుకుని పరుపు కప్పుకున్నాను. పరుపు కప్పుకోగానే నాకెంతో హాయి అనిపించింది. నా మనస్సు నిండా ఒక విధమైన చల్లదనం మెల్లదనం వ్యాపించాయి. నాకు నర్సంటే ప్రేమ. నర్సు నన్నూ తమ్ముణ్ణీ ప్రేమిస్తుంది. మమ్మల్ని ఎంతో ఇదిగా చూస్తుంది. నేను తమ్ముణ్ణి ప్రేమిస్తాను. తమ్ముడు నన్నూ, నర్సునూ ప్రేమిస్తాడు.

అమ్మ నన్నూ నర్సునూ ప్రేమిస్తుంది. నర్సు, అమ్మనూ నన్నూ, నాన్ననీ అందరినీ ప్రేమిస్తుంది. అందరూ అందరినీ ప్రేమిస్తారు. అందరూ సుఖంగా ఉంటారు' అనుకున్నాను.

నేనిలా తీయని ఊహాలు ఊహిస్తున్నాను. ఇంటిసేవకుడు పరుగెత్తుతూవచ్చి షుగర్ బేసిన్‌ను గురించి నర్సును కోపంతో కేకవెయ్యడం వినిపించింది. నర్సు కోపంగా ఏదో సమాధానం చెబుతోంది' తను తియ్యలేదంటోంది ఈ ఘట్టం చూసేసరికి, నాకు బాధ కలిగింది. భయంపుట్టింది భయం నన్ను దెయ్యంలా పట్టుకుంది. నేను పరుపులో దలదాచుకుని మునిగి పోయాను.. కాని ఆ చీకటికూడా నాకు విశ్రాంతి నివ్వలా.

ఒకమాటు ఒక పాలేరు కుర్రాణ్ణి కొట్టడం చూశాను. నాకు బాగా జ్ఞాపకం, కొడుతూంటే బాధ భరించలేక వాడు పెద్దగా అరవడం. మొదలెట్టాడు,' వాణ్ణి కొడుతున్న ఫోకా ముఖం భయంకరంగా కనుపిస్తోంది. 'ఈ సారి ఈపని చెయ్యవు, కదూ, చెయ్యవుకదూ.' అంటూ కొట్టడం సాగించాడు.. 'చెయ్యను బాబూ చెయ్యను' అంటూ కుర్రాడు అంటున్నాడు. కాని ఫోకా ఊరుకోలేదు. 'చెయ్యవుకదూ' అంటూ కొడుతూనే ఉన్నాడు.

ఈ ఘట్టంచూస్తూ నేను భరించలేకపోయాను. వెక్కి వెక్కి ఏడవసాగాను. వాళ్ళు నా చేత ఏడుపు మాన్పించడానికి ఎంతోసేపు పట్టింది. ప్రస్తుతం ఉన్న నా పిచ్చికి ఆ ఏడుపే ప్రారంభం

మరోసారి నాకు ఇలాంటి అవస్థే కలిగింది, మా మేనత్త జీసస్‌నుగురించి చెబుతూఉంది. ఒక కథచెప్పి వెళ్ళబోతూ..

ఉండగా మేము పిల్లలం, 'జీసస్‌ను గురించి ఇంకా చెప్పు' అని అడిగాం.

'నా కిప్పుడు పనుంది'

'ఊహు, చెప్పవూ'

మిట్కాకూడా అడిగాడు. అత్త చెప్పడం మొదలెట్టింది. జీసస్‌ను ఎలా బాధించారో, కొట్టి తిట్టారో, నానా చిత్రహింసలూ పెట్టి ఎలా శిలువవేశారో అంతా చెప్పింది. వాళ్ళలా బాధించి శిలువ వేస్తున్నప్పుడు జీసస్ ఎలా ప్రశాంతంగా ఉన్నాడో, తన్ను బాధిస్తున్న వారిని నిందించక, ఎలా నిశ్చలంగా ఈశ్వర ప్రార్థన సలిపాడో చెప్పింది.

'అతన్ని ఎందుకలా బాధపెట్టా రత్తా?'

'వాళ్ళు వట్టి కసాయివాళ్ళు'

'అతను మంచివాడేగా?'

'సరే నాకు పనుంది. వెడతా'

'వెళ్ళొచ్చు. ఈ ఒక్కమాట చెప్పి పో. అతను వాళ్ళను క్షమించాడుకదా, వాళ్ళతన్ని ఎందుకు బాధించారు?'

'తరువాత చెబుతా, నేను వెళ్ళి టీ తీసుకోవాలి.'

'అతన్ని వాళ్ళు కొట్టింది నిజం కాదేమో'.

'తరువాత చెబుతా'.

అత్త వెళ్ళిపోయింది. నేను వెక్కివెక్కి ఏడవసాగాను. తల గోడకేసి కొట్టుకున్నాను.

ఇది నా చిన్నతనంలో సంగతి. నా పద్నాలుగో ఏడొచ్చింది. నాలో శృంగార సంబంధమైన భావాలు మొల

కెత్తాయి. నేను కొద్దిగా తప్పుదోవకూడా పట్టాను. కాని, తరువాత అదంతా గడిచిపోయింది. అందరు శ్రీమంతుల బిడ్డల లాగానే తయారయ్యాను. హాయిగా తింటూ పనీ పాటా లేకుండా వినోద విలాసాల్తో కాలం వెళ్ళబుచ్చే కలవారి బిడ్డలందరి లాగానే నేనూ పెరిగాను. నా ఈడు కుర్రాళ్ళే నాకు పాపకార్యాలన్నీ నేర్పారు. నేనుకూడా ఆ పాపంలో మునిగి పోయాను. మొదట్లో చిన్న చిన్న పాపాలు. తరువాత పెద్దవి. రాను రాను స్త్రీలోలుణ్ణి అయ్యాను. ఇలా ముప్ఫయి అయిదు సంవత్సరాలు జీవించాను. ఇంతకాలం ఏలాటిబాధలూ ఎరగను. పిచ్చి తాలూకు చిహ్నాలుకూడా లేవు.

ఈ జీవితం నాకెంతో హాయిగా ఆనందంగా గడిచినట్టు తోచింది. ఇప్పుడు, ఆ రోజుల్లో ఏం సంఘటనలు జరిగాయో జ్ఞాపకంకూడా లేదు. కాని ఆ రోజులు ఇప్పుడు జ్ఞాపకం తెచ్చుకుంటే అసహ్యం కలుగుతోంది! నాలాటి కుర్రాళ్ళందరిలాగానే నేనూ హైస్కూల్లో చేరాను. తరువాత యూనివర్సిటీకి వెళ్ళాను. లా కోర్సు ముగించుకున్నాను. కొద్దికాలం సివిల్ సర్వీస్‌లో పని చేశాను. తరువాత నా భార్యను కలుసుకోడం ప్రేమించడం, వివాహం చేసుకోడం జరిగింది. జిల్లాల్లోకి ఉద్యోగానికి వెళ్ళాను. పిల్లలుకూడా కలిగారు. పిల్లల పెంపకం, ఎస్టేటు మానేజ్‌మెంట్—వీటితో రోజులు గడిచాయి.

నా వివహమైన తరువాత పది సంవత్సరాలకు మళ్ళీ చిన్నతనంలో వచ్చిన మానసిక అవస్థవచ్చింది. పెద్దయిన తరువాత రావడం ఇదే మొదటిసారి.

నా దగ్గర కొంత డబ్బుంది - నేనూ నాభార్యా కలిసి కూడబెట్టింది. ఒక ఎస్టేటు కొనాలని నిశ్చయించుకున్నాం. అందరిలాగానే ఆస్తి పెరిగే మార్గం చూడడం అంటే నాకు కూడా ఎంతో ఇష్టం. ఎంతో తెలివిగా ఇతరులందరికంటె ఎక్కువగా ఆస్తి పెంచాలని నాకోరిక. ఎస్టేట్లు ఎక్కడెక్కడ అమ్మకానికి ఉన్నాయో అన్నిచోట్లా విచారించాను. పేపర్లో ఎడ్వర్ టైజ్ మెంట్లుకూడా చదివాను. కలపవల్ల పెట్టుబడి అంతా తిరిగివచ్చే ఎస్టేటు కొందామని నా ఆశ. అలా అయితే నేను ఎస్టేటు కొన్నట్టేకాదు. ఊరికే వచ్చినట్టవుతుంది. వ్యాపారం తెలీని ఒక వెర్రివాణ్ణి పట్టుకున్నాను. వీడే నాకు తగినవా డనుకున్నాను.

పెన్జారాష్ట్రంలో ఒక పెద్ద ఎస్టేటు అమ్ముతున్నారు. ఆ ఎస్టేటులో పెద్ద అడవులుకూడా ఉన్నాయి. నేను విచారించిన వార్తలను బట్టి ఆ ఎస్టేటు యజమానివట్టి వెర్రివాడు. ఆ ఎస్టేటులో కలపద్వారా నేను పెట్టుబడి రాబట్టవచ్చు. నేను తక్షణం ఎస్టేటు చూడడానికి బయలుదేరి వెళ్ళాను. నేనూ నా సేవకుడూ బయలుదేరాం.

కొంతదూరం రైల్లో వెళ్ళాం, తరువాత గుర్రపు బగ్గీలో వెళ్ళాం. ప్రయాణం నాకెంతో హాయిగా ఉంది.

నాసేవకుడు కూడా కుర్రాడు. మంచి వాడు. ప్రయాణంలో కులాసాగా ఎన్నెన్నో కబుర్లు చెబుతూ ఉండేవాడు. ఎన్నో కొత్తసలాలు చూశాం. కొత్తమనుష్యులను కలుసుకున్నాం. మేము ఎస్టేటు చేరడానికి 140 మైళ్ళు ప్రయాణంచెయ్యాలి. మధ్యలో ఎక్కడా ఆగేవాళ్ళంకాదు. గుర్రాలు మార్చడానికి

మాత్రం ఆగేవాళ్ళం. రాత్రిళ్ళుకూడా ప్రయాణం చేసేవాళ్ళం. అప్పుడప్పుడు మా ప్రయాణపు అలసటకు నిద్రవచ్చేది. నేను తూగి నిద్రపోయేవాణ్ణి. హఠాత్తుగా ఏదో భయం పుట్టి ఉలికి పడి లేచేవాణ్ణి లేచినప్పుడు బాగా మెలకువగానే ఉండేది. నిద్ర మత్తు ఉండేదికాదు. నేనెందుకు వెడుతున్నాను? ఎక్కడికి వెడుతున్నాను?' అని ప్రశ్నించుకునేవాణ్ణి. ఎస్టేటు శోకధరలో కొనడం నాకు అయిష్టమనికాదు. కాని ఇంతదూరం నేను అనవసరంగా ప్రయాణం చెయ్యడం అనవసరమని, ఈ కొత్త స్థలంలో, అయినవాళ్ళు ఎవరూ లేకుండా నేను చనిపోవచ్చునని, నాకు విపరీతమైన భయం కలిగేది. ఈ భయం పోగొట్టుకోడానికి సేవకుడు సెర్గీతో కబుర్లు చెప్పేవాణ్ణి. మేము ప్రయాణం చేస్తున్న దేశాన్ని గురించి ఏవేవో కబుర్లు చెప్పుకునేవాళ్ళం. కాని నాభయం పొయ్యేదికాదు. ఇంట్లో వాళ్ళను గురించి మాట్లాడుకునేవాళ్ళం. మేము చెయ్యనున్న బేరాన్ని గురించి మాట్లాడుకునే వాళ్ళం.

నా సేవకుని మాటలు నాకెంతో ఆశాజనకంగా తోచేవి. అతని దృష్టిలో ప్రపంచమంతా హాయిగా ఆనందమయంగా ఉన్నట్టు కనుపించేది. కాని నాకు మాత్రం. అసహ్యంగాతోచేది. మాట్లాడుతున్నంతసేపూ నాకు కాస్తహాయిగా ఉన్నట్టనిపించేది. ఒకొక్కప్పుడు నాకు అలసటవేసి ఆగిపోదామనిపించేది. ఎక్కడైనా ఒక ఇంట్లో ఆగి ఆ ఇంట్లోవారితో కబుర్లు చెబుతూ టీ తాగి కాసేపు విశ్రాంతిగా నిద్రపోదామనిపించేది.

మేము అర్జమా పట్టణాన్ని సమీపిస్తూ ఉన్నాం.

'ఇక్కడ కాసేపాగి విశ్రాంతి తీసుకుందామా ?' అన్నాను.

'తప్పకుండా.'

'ఇంకా పట్నం దూరం ఉందా ?'

'అయిదు మైళ్ళు ఉంది.'

డ్రైవర్ మంచి పెద్దమనిషి. జాగ్రత్తగలవాడు. మెత్తగా నెమ్మదిగా బండి తోలుతున్నాడు.

పట్నం వైపుకు ప్రయాణం సాగించాం. నేను మాట్లాడకుండా నిశ్శబ్దంగా కూచున్నాను—ఇంకాసేపటికి విశ్రాంతి తీసుకోవచ్చుకదా అనే ఆశతో. చీకటిలో చాలాసేపు ప్రయాణంచేశాం. చివరకు పట్నం చేరుకున్నాం. మేము పట్నం చేరే సరికి బాగా ప్రొద్దు పోయింది. అందరూ నిద్రపోతున్నారు. చీకట్లో చిన్నచిన్న ఇళ్ళు కనుపిస్తున్నాయి. ఇండ్ల దగ్గర దొడ్లలో కట్టేసిన గుర్రాల కాలి మువ్వల మ్రోతలు వినిపిస్తున్నాయి. సున్నంకొట్టి తళతళా మెరుస్తున్న పెద్ద భవంతులు దాటి వెళ్ళాం. నేను విశ్రాంతికోసం అలమటించి పోతున్నాను.

చివరకు ఒక ఇంటి దగ్గరకు వచ్చాం. ఇల్లు తెల్లగా అందంగా ఉన్నది. కాని, నాకెందుకో ఆ ఇంటిని చూడగానే దిగులేసింది. నేను మెల్లగా బండి దిగాను.

సెర్గీ త్వరత్వరగా కావలసిన సామాన్లన్నీ దించాడు. పరుగెత్తుతూ లోపలికి వెళ్ళాడు. అతని అడుగుల చప్పుడు కూడా నాకు మరింత నిరుత్సాహం కలిగించింది. చిన్న వసారాలో ప్రవేశించాం నిద్రమత్తుగాఉన్న ఒకవ్యక్తి మాకోగది

చూపించాడు. అతని బుగ్గమీద మచ్చఉంది. అతన్ని చూచే సరికి నాకు భయంకలిగింది. మాకు చూపించిన గది చిక్కటి గుయ్యారంలా ఉంది. ఆ గదిలో ప్రవేశించేసరికి నా నిరుత్సాహం మరీ ఎక్కువైంది.

'పడకగది లేదా? నేను కాసేపు విశ్రాంతి తీసుకోవాలి.'

'ఇదే పడకగది.'

గది చిన్నది. ఇరుగ్గా ఉంది. గోడలకు సున్నం కొట్టారు. గది నలుచదరంగా ఉంది. గది చదరంగా ఉండడం నాకు బాధ నిపించింది. ఒకటే కిటికీ. ఎర్ర కర్టన్. ఒక టేబిలు. ఒక సోఫా. మేము లోపలికి వెళ్ళాం. సెర్గీ స్టౌవ్ వెలిగించి టీ చేశాడు. నే నొక తలగడా తీసుకుని సోఫామీద పడుకున్నాను. నేను నిద్రపోవడంలే టీ ఎలా చేస్తున్నాడో గమనిస్తూ పడుకున్నాను. సెర్గీ టీ కాచడం ముగించి నన్ను పిలిచాడు. నాకు సోఫామీదనుంచి లేవమంటే భయంవేసింది. లేవకుండా అలాగే తూగుతూ పడుకున్నాను. ఆ తూగులో అలాగే నిద్రపోయాను, నేను లేచి చూచే సరికి గదంతా చీకటిగా ఉంది. మళ్ళీ నాకు మెలకువవచ్చింది, పూర్తి మెలకువ. ఎంతో యత్నించాను కాని నిద్రపట్టడంలేదు. 'ఇక్కడికెందుకొచ్చాను. నన్ను నేను ఎక్కడికి లాక్కుని పోతున్నాను? నే నెక్కడికి పలాయనం చేస్తున్నాను? ఏదో భీకరమైన విషయంనుంచి దూరంగా తప్పించుకుని పోతున్నానా? నేను నాలోనే ఉన్నాను. నన్ను నేనే బాధించుకుంటున్నాను. నేను — పూర్తిగా నే నిక్కడే ఉన్నాను. పెన్జా ఎస్టేట్ కాని మరే ఆస్తి కాని నాకు ఇచ్చేదీ లేదు నా దగ్గరనుంచి పుచ్చుకునేదీ లేదు. నన్ను నేనే

'అసహ్యించుకుంటున్నాను నాకు నేనే బరువుగా ఉన్నాను. నన్ను నేనే భరించలేకూడా ఉన్నాను. నిద్రలో నన్ను మరచి పోదామనుకుంటాను. కాని సాధ్యంకాదు.' — ఇలాటి సమస్య లన్నీ నన్ను బాధించసాగాయి.

బైట వసారాలోకి వెళ్ళాను. సెర్గీ ఒక చిన్న బెంచీ మీద పడుకుని నిద్రపోతున్నాడు. ఒక చెయ్యి కింద వ్రేలాడు తోంది. ఆ చిన్న బెంచీమీదనే అతను ప్రశాంతంగా నిద్రిస్తున్నాడు. ముఖంమీద మచ్చవున్న మనిషికూడా నిద్రి స్తున్నాడు. నా బాధనుంచి తప్పించుకుందా మనే ఉద్దేశంతో వసారాలోకి వచ్చాను. కాని నాతోనే నాబాధకూడావచ్చింది.

'ఇదేం చిత్రం? ఎక్కడికి వెళ్ళినా ఈబాధ వెంటాడు తోంది. అసలు ఈ భయం ఎందుకు? దీనికి కారణం ఏమిటి?' అనుకున్నాను.

'నేను' అన్నది మృత్యువు. మృత్యువు గొంతుక అది. అవ్యక్తంగా వినిపించింది.

'నేను. ఇదుగో ఇక్కడే ఉన్నాను,' అన్నది

నా శరీరమంతా చెమటలు పట్టింది. అవును! మృత్యువే! మృత్యువు వస్తుంది. రాకతప్పదు; ఇక్కడే కాచుకుని ఉంది. నేను నిజంగా అప్పుడు మరణావస్థలో ఉన్నా. అంత బాధపడేవాణ్ణి కాదు. అప్పుడు పట్టి భయంమాత్రం కలిగివుండేది. ఇప్పుడు నాకు భయంకాదు కలుగుతున్నది. మృత్యువు ఆగమనాన్ని ఎదురుచూస్తున్నాను. ఒక వైపునుంచి మృత్యువురాక ప్రత్య క్షంగా చూస్తున్నాను. మరోవైపునుంచి మృత్యువు అన్యాయం అనుకుంటున్నాను.

ప్రతిప్రాణికీ జీవించవలసిన హక్కూ అవసరం వున్నా యని నా హృదయం ఘోషిస్తోంది. కాని మృత్యువు తన పని తాను చేసుకుపోతోంది. ఈ అంతరంగిక ఘర్షణ భీకరంగావుంది. ఎంత వదిలించుకోవాలని యత్నించినా ఈభయం నన్ను వదల డంలేదు. పిశాచం లా పట్టుకుంది. ఆ చీకటిలో ఒక కొవ్వొత్తి కోసం వెదికాను. కొవ్వొత్తి వెలిగించాను. కొవ్వొత్తి ఎర్రని కాంతికూడా నాకు ఇదే సత్యాన్ని చెప్పింది, 'జీవితంలో ఏమీ లేదు. జీవితం మిథ్య. మృత్యువు ఒక్కటే సత్యం!' అని.

ఇలాంటి భావాలనుంచి నా మనస్సు మరల్చుకోడానికి యత్నించాను.

నేను కొనబోయే ఎస్టేటునుగురించి నా భార్యనుగురించి ఆలోచించడం మొదలెట్టాను. కాని నాకు ఎక్కడా సంతోషం ఉత్సాహం కనుపించలా. అన్ని విషయాలనూ మృత్యువే ఆవరించినట్టుగా కనుపించసాగింది. నిద్రపోదా మనుకుంటాను. కాని నిద్ర పట్టదు. పడుకోగానే భయంతో ఉలికిపడి లేచి కూచుంటాను. ఏదో మూర్ఛరోగం నన్ను ఆవేశించినట్లని పించింది. జీవితం, మృత్యువు, రెండూ కలిసిపోతున్నట్టుగా కను పించసాగాయి. ఏదో నన్నూ నా ఆత్మను వేరుచేస్తోంది. కాని వేరుచెయ్యడం పూర్తికాలేదు. అందుకనే ఇంత బాధ. మళ్ళీ నిద్రపోతున్న వారివంక చూడసాగాను. నిద్రపోవడానికి యత్నిం చాను. కాని నిద్రపట్టలా. అదే భయం; అదే భయం. ఏదో లోపల చిరిగిపోతున్నట్టు! కాని పూర్తిగా చిరిగిపోదు.

ఎవరు సృష్టించారు నన్ను? ఈశ్వరు డంటారు ఈశ్వ రుడు! నాకు ప్రార్థన జ్ఞాపకం వచ్చింది. ఇరవై సంవత్సరాలు

నేను ప్రార్థించలేదు. నాకు ఎందులోనూ విశ్వాసం కలగలేదు. ఇప్పుడు మళ్ళీ ప్రార్థించడం మొదలెట్టాను. 'ప్రభూ! కరుణించు కన్నతండ్రి! కరుణించు!; అని ప్రార్థించడం మొదలెట్టాను. కొత్త ప్రార్థనలు సమకూర్చాను, ఎవరైనా చూస్తారేమోనని అటూ ఇటూ చూస్తూ నేలకు వంగి ప్రార్థన సలిపాను. కొంచెం భయం తగ్గినట్లనిపించింది పడుకున్నాను. కాని, పడుకుని కళ్ళు మూసుకున్నానో లేదో మళ్ళీ అదే భయం! ఇక భరించలేకపోయాను. హోటల్ సేవకుడు సెర్గీని లేపాను, బండి కట్టమని మళ్ళీ బయలుదేరాను.

గాలి చల్లగా వీస్తోంది. కొంచెం హాయిగా ఉంది. కాని నా హృదయంలో ఏదో ప్రవేశించి నా జీవితాన్ని విషపూరితం గావించినట్లు తోచింది.

రాత్రయ్యేసరికి గమ్యస్థానం చేరాం. పగలంతా నన్ను కుంగదీస్తున్న నిరాశను జయించడానికి ప్రయత్నం చేస్తున్నాను. కొంతవరకు జయించగలిగాను. కాని ఆ నిరాశ తాలూకు పగుళ్ళు నా హృదయంలో మిగిలిపోయాయి. కొద్ది సేపుమాత్రమే మృత్యుభయాన్ని మరిచిపోగలిగాను. కాని అది నా హృదయంలో అట్టడుగున పడి ఉంది.

ఎస్టేటు యజమాని నన్ను ఎంతో ప్రీతితో ఆహ్వానించాడు. ఎస్టేటు అమ్మవలసి వచ్చినందుకు చింతించాడు.

గదుల్లో ఫర్నిచర్ అంతా బాగుచేయించాడు. గదులన్నీ శుభ్రంగా ఉన్నాయి. ఎస్టేటును గురించి కొన్ని ప్రశ్నలడిగాను. అతను వివరాలన్నీ చెప్పాడు. ఎలాగైతేనేం ఆ రోజు నిద్ర బాగానే పట్టింది. దీనికి కారణం నిద్రపోవడానికి ముందు ప్రార్థించడ మనుకున్నాను.

తరువాత నేను ఆ ట్టే ఒడుదుడుకులు లేకుండా పూర్వం లాగానే జీవిస్తున్నాను. కాని నా హృదయంలో ఎక్కడనో ఆ భయం వ్రేలాడుతూనే ఉంది. ఆలోచించకుండా అలవాటు పడిన వాతావరణానికి అనుకూలంగా జీవిస్తున్నాను. ఒక కుర్రాడు పాఠం వల్లే వేసి ఒప్పచెప్పినట్టుగా ఉంది నా జీవితం. ఇలా జీవించడంవల్లనే ఆ భీకరమైన భయానికి దూరంగా ఉండ గలుగుతున్నాను.

ఇంటికి క్షేమంగా చేరాను. ఎస్టేటు కొనలేదు. డబ్బు తగినంత లేదు. పూర్వంలాగానే జీవిస్తున్నాను. ఇప్పుడు నా జీవితంలో వచ్చిన మార్పు ఒకటే. ప్రార్థిస్తున్నాను. చర్చికి పోతున్నాను అంతే. పూర్వం ఎలా జీవిస్తూ వచ్చానో అలాగే జీవిస్తున్నాను. పెద్ద మార్పేమీలేదు, అంటే పూర్వం ప్రారంభించిన జీవిత క్రమాన్నే కొనసాగిస్తున్నాను. పూర్వపు రైలు పట్టాలమీదే సాగిపోతున్నాను. ప్రపంచమంతా నాకు శూన్యంగా, ఉత్సాహరహితంగా కనుపించసాగింది. పవిత్రతను అవలంభించాను. నా భార్య ఇది గమనించి నన్ను విసిగించి వెనక్కులాగడం మొదలెట్టింది.

ఒకమాటు తలవని తలంపుగా మాస్కో వెళ్ళవలసి వచ్చింది. మధ్యాహ్నం సామాన్లన్నీ సర్దుకుని సాయంత్రం బయలుదేరివెళ్ళాను. ఒక కోర్టుపనిమీద నేను వెళ్ళింది. మాస్కోలో దిగేవరకూ హాయిగానే ఉన్నాను. దార్లో ఒక భూస్వామి కనిపించాడు. అతనితో ఎస్టేటు మానేజిమెంటు విషయం, బాంకులు, సినిమాలు; నాటకాలు చర్చిస్తూ ప్రయాణించేశాను.

మేమిద్దరం కలిసి మాస్కో-హోటల్లో మకాంచేసి ఆ సాయంత్రం 'ఫాస్ట్' నాటక ప్రదర్శన చూడటానికి వెడదామనుకున్నాం.

మేము హోటల్లో దిగగానే ఒక చిన్నగది చూపించారు. వరండాలో వాసన అసహ్యంగా ఉంది. ఒక పని మనిషి ఒక కొవ్వొత్తి తెచ్చి వెలిగించింది. పక్క గదిలో ఎవరో దగ్గుతున్నారు. ముసలాడులా ఉన్నాడు. పని మనిషి కొవ్వొత్తి వెలిగించి వెళ్ళిపోయింది. ఒక సేవకుడు మాత్రం ఉన్నాడు. కొవ్వొత్తి వెలుగుతోంది. కొవ్వొత్తి వెలుగులో పసుపురీరల గోడ కాగితం కనుపిస్తోంది. గది ఇరుగ్గా ఉంది. ఎస్టేట్ కొనడానికి వెళ్ళేప్పుడు ఆర్జమాలో నన్ను ఎలాటి దిగులు ఆవరించిందో అలాటి దిగులే ఆవరించింది. 'భగవంతుడా! ఈ రాత్రంతా ఈ కూపంలో ఎలా ఉండడం?' అనిపించింది.

సేవకుణ్ణి సామాన్లు విప్పమన్నాను 'త్వరగా ముస్తాబై నాటక ప్రదర్శనానికి వెడతాను. ఎనిమిదో నంబరు గదిలోకి వెళ్ళి నాతో కలిసివచ్చిన పెద్దమనిషితో ఇప్పుడే వస్తున్నానని చెప్పు' మని సేవకునితో చెప్పాను.

సేవకుడు వెళ్ళిపోయాడు. నేను త్వరగా ముస్తాబయ్యాను. గోడలవంక చూడడమంటే భయం వేసింది. 'ఏమిటీ భయం? అర్థంలేకుండా ఉంది. చిన్నపిల్లలా భయపడుతున్నాను. నాకు దెయ్యాలంటే భయంలేదు దెయ్యాలు! దెయ్యాన్నే అవుతే బాగుండేది! ఎందుకు భయం? నన్నుచూస్తే నాకే భయం కలుగుతోందా?' అనిపించింది.

బాగా గంజిపెట్టి బిరుసుగా ఉన్న షర్టు వేసుకున్నాను. ఈవినింగ్ కోటు, కొత్తబూట్లు వేసుకున్నాను. నాతో కలిసి

వచ్చిన భూస్వామి గదికి వెళ్ళాను. ఇద్దరం కలిసి నాటకం చూడడానికి బయలు దేరాం.

అతను మధ్యలో ఆగి ఒక హెయిర్ డ్రెసర్ దుకాణం లోకి వెళ్ళి జుట్టు వంకులు తీయించుకున్నాడు. నేను జుట్టు కత్తిరించుకున్నాను. ఒక గ్లోవ్రులజత కూడా కొన్నాను. అంతా హాయిగానే ఉంది నా ఇరుకుగది విషయంకూడా మరిచి పోయాను. నాటకశాలలోకూడా హాయిగా గడిచింది. నాటకం కాగానే నాతోవచ్చిన భూస్వామి భోజనానికి వెళదామన్నాడు. కాని నాకు అలవాటు లేదు, అయినా నా ఇరుకుగదిలో అడ్డు గోడ జ్ఞాపకం వచ్చి సరేనని ఒప్పుకున్నాను.

మేము తిరిగి వచ్చేసరికి ఒంటిగంటయింది. నేను రెండు గ్లాసులు ద్రాక్షరసం పుచ్చుకున్నాను. ద్రాక్షరసం పుచ్చుకోడం ఇంతకుముందు నాకు అలవాటు లేదు. అయినా హాయిగానే ఉంది. మేము హోటల్ వరండాలో ప్రవేశించగానే మళ్ళీ నాకు భయం పుట్ట సాగింది. నా స్నేహితుడి చెయ్యి గట్టిగా పట్టుకుని లోపలికి వెళ్ళాను.

ఆ రాత్రి భయంకరంగా గడిచింది. తెల్లవారేవరకూ నిద్ర పట్టలేదు. పక్కగదిలో ముసలాయన దగ్గుతున్నాడు. తెల్లవారుఝామున ఒక చిన్న కునుకు పట్టింది. అదైనా పక్క మీదకాదు. పక్కమీద పడుకుని నిద్రిద్దామని ఎన్నోసార్లు ప్రయత్నించాను. కాని నిద్రపట్టలేదు. చివరకు సోఫామీద నిద్ర పట్టింది. రాత్రింతా భీకరమైన ఆవేదన అనుభవించాను. నా దేహమూ ఆత్మా విడిపోతున్నట్టు యమయాతన పొందాను.

'నేను బ్రతుకుతున్నాను. బ్రతికాను. బ్రతకడం అవసరం. అయినా హఠాత్తుగా మృత్యువు నా బ్రతుకు నాశనం చేస్తోంది. ఇక ఈ బ్రతుకెందుకు ? దీనికీ అర్థం వమిటి ? చావడానికేనా బ్రతుకు ?' ఆత్మహత్య ! నాకు భయం ! చావు వచ్చేవరకూ కాచుకుని ఉంటే ? అది మరీ భయం. నేను బ్రతకాలి. కాని ఎందుకు ? చావడానికేనా ?'—ఇలా ఆలోచించాను. ఈ విషవ్యూహానుంచి బైటపడడం ఎలానో నాకు తోచలేదు. ఒక పుస్తకం తీసి చదవడం మొదలెట్టాను. కాని మళ్ళీ అదే ప్రశ్న ! అదే భయం ! కళ్ళు మూసుకున్నాను. కాని నిద్ర వస్తేగా !

ఇదంతా ఈశ్వరుడి ఏర్పాటు. అయితే, ఇలా ఎందుకు ఏర్పరచినట్టు ? 'ఆ ప్రశ్న అడగొద్దు ప్రార్థించు. నీకే తెలుస్తుంది' అంటారు పెద్దలు. సరే. ప్రార్థించడం మొదలెట్టాను. ఒక పసిపిల్ల వాడిలా ప్రార్థించాను. పూర్వం కాని ఇప్పుడు నా ప్రార్థనలకు ఒక అర్థం ఉన్నది.

'భగవంతుడా ! నీ ఉనికి సత్యమవుతే నా జీవితానికి అర్థం నాకు తెలియచెప్పు. నె నెవరో నాకు తెలుపు' అని ప్రార్థించాను. సమాధానంకోసం కాచుకున్నాను. కాని సమాధానం రాలేదు. అసలు సమాధానం చెప్పేవారు ఎవరూ లేరని పించింది. భగవంతునికి మారుగా నా ప్రశ్నలకు నేనే జవాబు చెప్పుకోడం మొదలెట్టాను. 'నేనెందుకు ? బావిలో జీవించడానికి అయితే ఈ అజ్ఞానం, ఈ యాతన ఎందుకున్నాయి ? నాకు భవిష్యజ్జీవితంలో విశ్వాసంలేదు. ఈశ్వరుడా! నీవే ఉంటే

నీవు మానవులందరికీ ఎందుకు జవాబు చెప్పవు ? నీవు లేక పోతే దుఃఖం నిరాశ తప్ప మరేమీలేదు. నే నది భరించలేను ?’

‘నాకు కోపం వచ్చింది. భగవంతుడిమీద కోపం వచ్చింది. నాకు సత్యాన్ని తెలపమని అడిగాను. కాని తెలప లేదు. అడుగు. నీవు కోరింది ఇస్తాను’ అన్నమాట జ్ఞాపకం వచ్చింది. అడిగాను, కాని కోరింది రాలేదు. బహుశా తప్పు నా చేనేమో? నేను ప్రార్థించలేదేమో? తిరస్కరించానేమో? నేను నిజంగా భగవంతుని విశ్వసించకుండా భగవంతుణ్ణి అడిగా నేమో. నేను భగవంతునితో అప్పులవాడిలా లెక్క సరిచూ చుకుని ఉంటాను. నిజంగా నమ్మకంతో అడిగిఉండను.

మరుసటి రోజు సాధ్యమైనంతవరకు నాశక్తినంతా విని యోగించి నాపనులన్నీ చూచుకున్నాను. ఇంకా పనులన్నీ పూర్తికాకపోయినా ఆ సాయంత్రమే ఇంటికి వెళ్ళాను. మాస్కోలో గడిపిన ఆ రాత్రి నాజీవితంలో ఇంకా మార్పు తెచ్చింది. లౌకికవ్యవహారాలపట్ల ఒక విధమైన అనాసక్తి కలి గింది. ఆరోగ్యంకూడా కొద్దిగా క్షీణించింది. నాభార్య డాక్ట ర్‌కు చూపించి మందు పుచ్చుకోమని సలహా ఇచ్చింది. మతాన్ని గురించి, ఈశ్వరుణ్ణి గురించి నేను మాట్లాడే మాట లన్నిటికి కారణం నా అనారోగ్యమే నన్నది. కాని నా అనా రోగ్యానికి కారణం నాలో తీరని సమస్యేనని నాకు తెలుసు. అహర్నిశలూ ఆ సమస్యను గురించి ఆలోచించకుండా ఉండడా నికి యత్నించాను. సాధారణమైన పనులకు జీవితాన్ని అల వాటు చేసుకున్నాను. ఆదివారాలు చర్చికి వెళ్ళేవాణ్ణి. ఉపవా సాలుకూడా ప్రారంభించాను. ప్రార్థనలుకూడా చేసేవాణ్ణి. దీని

వల్ల ఏదో ఫలితం వస్తుందని నే నాశించలేదు. ఏదో అలవాటు పడిన పనులుచేసినట్టు చేస్తేవాణ్ణి. ఎక్కేటు వ్యవహారాలతో జీవితం గడపడం మానేశాను. ఆ గొడవలన్నీ ఎదుర్కొనే శక్తి తగ్గిపోయింది. పత్రికలూ, నవలలూ చదువుతూ అప్పుడప్పుడూ పేకాడుతూ కాలక్షేపం చేస్తున్నాను. ఎప్పుడైనా వేటకు వెళ్ళే వాణ్ణి. నాకు వేటంటే ఇష్టం.

ఒక రోజున ఒక పొరుగు వేటగాడు వచ్చాడు. తనతో తన వేట కుక్కలనుకూడా తీసుకుని వచ్చాడు. మేము అడవిలో వేటాడే ప్రదేశం చేరగానే మంచు చెప్పులు ధరించి తోడేలు దొరికే ప్రదేశానికి వెళ్ళాం. కాని వేట సరిగా సాగ లేదు. కుందేళ్ళను వెదుకుతూ వెళ్ళాను. చిక్కని అడవి మధ్యలో దోవ తప్పాను. మంచు దట్టంగా వుంది. 'నే నెక్క డున్నాను?' అని నన్ను నేను ప్రశ్నించుకున్నాను.

నేను దోవతప్పినట్టు గుర్తించాను. నేను కేకేస్తే ఎవ రికీ వినిపించదుకూడా. చాలా అలసిపోయి ఉన్నాను. ఒళ్ళంతా చెమటతో తడిసిఉంది. నేనక్కడ ఆగితే మంచులో పూడుకు పోతాను. అక్కడనుంచి కదిలివెళ్ళేశక్తి లేదు. కేకేశాను. నిశ్శబ్దం... ఎవరూ వినిపించుకోలేదు. జవాబులేదు. తిరిగిచూచాను. చుట్టూ అడవి. నలుప్రక్కలా చెట్లు. దిక్కులుకూడా తెలీడం లేదు. కాళ్ళు చచ్చుబడిపోతున్నాయి. భయం పుట్టి ఆగి పోయాను. గుండెకొట్టుకోడం మొదలెట్టింది. కాళ్ళూ చేతులూ వణుకు తున్నాయి. 'మృత్యువంటే ఇదేనా? మృత్యువు! మృత్యువుకు అర్థం ఏమిటి?' మళ్ళీ భగవంతుణ్ణి ప్రశ్నిద్దామను కున్నాను. అర్థం చెప్పనందుకు నిందిద్దామనుకున్నాను. కాని

ఇప్పుడు, ఇక్కడ అలా చెయ్యగల సాహసం నాకు లేదనిపిం చింది. భగవంతుణ్ణి క్షమించమని ప్రార్థించాను.

కాసేపు అలాగే భయంతో ఉండిపోయాను. భయం కొద్దిగా తగ్గింది. అలాగే ఒక దిక్కున నడుస్తూ వెళ్ళి అడవి నుంచి బైటపడ్డాను. నాచేతులూ కాళ్ళూ వణుకుతూనే ఉన్నాయి. కాని మనస్సుకు సుఖంగా ఉంది. వేటగాళ్ళు కను పించారు. ఇంటికి తిరిగివచ్చాం. నేను సుఖంగా ఉన్నాను. ఆనందం ఏకాంతంలో లభ్యమవుతుందనుకున్నాను. ఒంటరిగా గదిలోకూచుని ప్రార్థించాను. నా పాపాలు క్షమించమని భగ వంతుణ్ణి కోరాను.

*　　*　　*　　*

తరువాత మతగ్రంథాలు చదవడం మొదలెట్టాను. గాస్పెల్స్ (జీసస్ జీవితకథలు) నా హృదయాన్ని ఎంతో కదిలించాయి. ముఖ్యంగా మహాత్ముల జీవితచరిత్రలు చది వాను. నాకెంతో ఓదార్పు కలిగింది. వారి అడుగుజాడలలో జీవితాన్ని తీర్చి దిద్దుకుందా మనుకున్నాను. అప్పటినుంచి కుటుంబ వ్యవహారాలపట్ల శ్రద్ధ తగ్గింది. ఒక విధమైన అసహ్యం కూడా కలిగింది. అంతా తప్పుగా కనుపించింది. కాని 'నిజం' ఏదో ఇంకా నాకు పూర్తిగా తెలీలేదు.

కొద్ది దూరంలో ఒక ఎస్టేటు అమ్మకానికి ఉంది. చూడడానికి వెళ్ళాను. అన్నివిధాలా బేరం అనుకూలంగా ఉంది. అక్కడి రైతులకుకూడా సొంతభూమి లేదు, చిన్నచిన్న పెరటి తోటలు తప్ప. వాళ్ళు భూస్వామి భూమిలో పనిచేసి

బ్రతకాలి. ఇదంతా గ్రహించాను. ఇంటికి తిరిగి వస్తూండగా దోవలో ఒక ముసలిది కనుపించి దోవకోసం అడిగింది. ఆ ముసలిదానితో కాసేపు మాట్లాడాను. అది తన దారిద్ర్యాన్ని గురించి చెప్పింది. ఇంటికి వెళ్ళిన తరువాత ఎస్టేటు కొనడమంటే నాకు అసహ్యం కలిగింది. నా భార్యతో నేను ఎస్టేటు కొనననీ, రైతుల దారిద్ర్యంమీద మనం బ్రతకడం అన్యాయమని చెప్పాను. అప్పుడు నాకు నిజం తెలిసింది. రైతులు కూడా మనుష్యులేననీ, మనతోటి సోదరులని గ్రహించాను. నా భార్యకు విసుకెత్తి నన్ను నిందించింది. నా పిచ్చికి ఇదే మొదలు. కాని నాకు పూర్తిగా పిచ్చిపట్టడం ఒక నెల తరువాత జరిగింది.

నేను చర్చికి వెడుతున్నాను. ప్రార్థన సలుపుతున్నాను. చర్చిలో బోధలు వింటోంటే నా హృదయం ద్రవిస్తోంది. ప్రార్థన ముగిసినతరువాత శిలువ దగ్గరకు వెళ్ళాం.

జనం తోసుకుంటూ వచ్చారు. బైట వాకిట్లో బిచ్చగాళ్ళు గుంపులుగా ఉన్నారు. ఈ బిచ్చగాళ్ళు ఉండడం తీరని అన్యాయమనిపించింది.

అప్పుడు నాలో ఒక వెలుగు కనుపించింది. బైటికివస్తూ దగ్గరఉన్నదంతా బిచ్చగాళ్ళ కిచ్చేశాను. కాలినడకన అందరితో కలిసి ఇంటికి వెళ్ళాను.



# యజమాని — మనిషి

ఈ కథ శీతాకాలంలో జరిగింది. సెయింట్ నికొలస్ పర్వదినానికి మరుసటిరోజు. ఆ జిల్లాలో అంతటా పెద్ద ఉత్సవం జరిగింది. వాసిలి యాండ్రివిచ్ ఆ ఊళ్ళో పెద్దవ్యాపారి. పైగా చర్చి పెద్దల్లో అతనూ ఒకడు. వాసిలీ యాండ్రివిచ్ కూడా చర్చికి వెళ్ళి పూజా పునస్కారాలు ముగించుకుని తన స్నేహితులకూ బంధువర్గానికి విందు చేశాడు.

అందరూ వెళ్ళిపోయిన తరువాత అతను ఒకతోట కొనడానికి ప్రయాణమైనాడు. ఆ తోట ప్రక్కఊళ్ళో ఒక భూస్వామిది. నగరంనుంచి ఇతర కొనుగోలు దారులు తనకంటె ముందుగా వచ్చి తక్కువధరకు తోట కొనేస్తారనే భయంతో తను త్వరత్వరగా ప్రయాణమైనాడు. ఆ తోట యజమాని యువకుడు. అతను తనతోటకు పదివేల రూబుల్స్ ధర చెబుతున్నాడు. అదైనా వాసిలి యాండ్రవిచ్ ఏడువేలు ఇస్తానంటున్నాడు కాబట్టి, నిజానికి ఆ తోట ఖరీదులో ఏడువేలు మూడోవంతుకూడా చెయ్యదు. వాసిలి యాండ్రవిచ్ తను అనుకున్న ధరకు కొనగలిగేవాడే. అడవులన్నీ అతను నివసిస్తున్న జిల్లాలోనే ఉన్నాయి. అతని గ్రామంలోని ఇతర వ్యాపారస్థులతో అతనికి ఎన్నాళ్ళనుంచోనడుస్తున్న ఒడంబడికలుకూడా ఉన్నాయి. అందుచేత మరోజిల్లాలో వాళ్ళు తన ధరకంటె ఎక్కువ ధరనిచ్చి కొనరు. కాని ఇప్పుడు నగరంనుంచి కొందరు కలప వర్తకులు ఆ తోటను కొనడానికి వస్తున్నట్టు అతనికి తెలిసింది.

వెంటనే వెళ్ళి వ్యవహారం సర్దుబాటు చేశెయ్యాలనుకున్నాడు. విందు ముగిసిన వెంటనే తన ఇనప్పెట్టెలోనుంచి ఏడువందల రూబుళ్ళు తీసుకున్నాడు. దానికి తన దగ్గర నిలవలో ఉన్న రెండువేల మూడువందల రూబుళ్ళు చర్చిడబ్బు కలిపాడు. అప్పటికి మొత్తం మూడువేలవుతోంది. భద్రంగా నోట్లన్నీ లెక్కించుకుని పాకెట్ పుస్తకంలో పెట్టుకుని బయల్దేరాడు.

ఆరోజు వాసిలియాండ్రవిచ్ పనివాళ్ళలో తాగకుండా ఉన్నవాడు నికిటా ఒక్కడే. నికిటా పరుగెత్తుకుంటూ వెళ్ళి గుర్రాన్ని తయారుచేశాడు. నికిటాకు సాధారణంగా తాగడం అలవాటే కాని ఆరోజు మాత్రం తాగలేదు ఉపవాసానికి పూర్వం చివరిరోజున తన కోటూ బూట్లూ అమ్మేసి తాగాడు. అప్పటినుంచీ తాగనని ఒట్టుపెట్టుకున్నాడు. రెండు నెలలనుంచి తన దీక్ష సాగిస్తున్నాడు. వోడ్కా అతన్ని అప్పుడప్పుడు మభ్య పెడుతున్నా తన ప్రమాణం నిలబెట్టుకుంటున్నాడు. విందు మొదటి రెండు రోజులూ అందరూ తాగినా తను మాత్రం ఒక్క చుక్కకూడా ముట్టుకోలేదు.

నికిటా రైతు. అతని వయస్సు సుమారు యాభయి ఉంటుంది. అతనిది ప్రక్క గ్రామం. చాలా రోజులనుంచీ తన గ్రామంలో నివసించకుండా అక్కడా ఇక్కడా శ్రామికుడుగా జీవిస్తున్నాడు. అతను పనిచేస్తూ వచ్చినచోటల్లా మంచి పేరు తెచ్చుకుంటున్నాడు. శ్రమపడి పనిచేస్తాడని, నైపుణ్యంతో నేర్పుతో పనిచేస్తాడని, ఎంత బరువైన పనైనా విసుక్కోకుండా ఓర్పుతో చేస్తాడని, ఎప్పుడూ నవ్వుతూ హాయిగా ఉంటాడని అతనికి మంచి పేరుంది. కాని అతను ఎక్కడా స్థిరంగా ఉండ

లేకపోయాడు. సంవత్సరానికి రెండుసార్లో లేక ఇంకా పైనెప్పు డల్లా తాగుడు మజాలో పడేవాడు. తన బట్టలన్నీ అమ్మి తాగేసేవాడు. అంతేకాక పోట్లాటలుకూడా తెచ్చుకునేవాడు. వాసిలి యాండ్రవిచ్ కూడా అతన్ని ఎన్నోసార్లు పనిలోనుంచి పంపేశాడు. కాని, అతని నిజాయితీని, పశువులపట్ల అతని ప్రేమను, అతను చౌకబారుగా పనికిరావడాన్నీ చూచి మళ్ళీ పనిలోకి తీసుకునేవాడు. అసలు అలాటి పనివాడికి సంవత్సరానికి ఎనభై రూబుళ్ళు ఇస్తారు. కాని వాసిలియాండ్రవిచ్ నలభై మాత్రమే ఇచ్చేవాడు. అదైనా ఒక్కమాటుగా ఇచ్చేవాడుకాదు. అప్పుడప్పుడు కొద్ది మొత్తాలుగా ఇచ్చేవాడు. అదైనా డబ్బు రూపంలో కాకుండా తన దుకాణంలోని వస్తువుల రూపంగా ఎక్కువ ధరలువేసి ఇచ్చేవాడు.

నికిటా భార్య మార్తా. మార్తా ఒకప్పుడు అందంగా బలంగా ఉండేది. తన కొడుకు, ఇద్దరు కూతుళ్ళ సహాయంతో తనే సంసారమంతా ఈదుకొస్తూఉండేది. నికిటాను ఇంట్లో ఉండమని బలవంతపెట్టేదికాదు. దీనికి కారణాలు చాలా ఉన్నాయి. ఇరవైఏళ్ళబట్టి వారి ఇంట్లో ప్రక్క గ్రామంలోని ఒక రైతు నివసిస్తున్నాడు. అతను పడవ ప్రయాణికులకు సారాయి సప్లయి చేస్తూ వచ్చేవాడు. నికిటా భార్యకూ అతనికీ సంబంధాలున్నాయి. అదీగాక, వట్టి సమయాల్లో భర్తను ఎలాగో ఒకలా సద్దుకుని వచ్చినప్పటికీ తాగినప్పుడు అతనంటే హడలిపోయేది మార్తా. అతన్ని చూస్తే ఆకలైన సింహాన్ని చూచినట్టుగా ఉండేది. ఒకమాటు, నికిటా బాగా తాగాడు. తాగనప్పుడు ఎంత సాధువుగా ఉండేవాడో తాగినప్పుడు అంత

ఉద్ధృతంగా ఉండేవాడు. ఆరోజు బాగా తాగి మార్తా పెట్టె తెరచి ఆమె విలువైన బట్టలన్నీ బైట పడేసి ఒక గొడ్డలి తీసుకుని ముక్కలు ముక్కలకింద చేశాడు. అప్పటినుంచి అతను తాగాడంటే భార్యకు విపరీతమైన భయం. నికిటా పనిచేసి సంపాదించే సంపాదనంతా భార్యకే వెళ్ళేది. అందుకు అతను అభ్యంతర పెట్టేవాడు కాదు. ఇప్పుడు సెలవుకుముందు రెండురోజుల క్రితం మార్తా వాసిలియాండ్రవిచ్‌ని చూడడానికి వెళ్ళి గోధుమపిండి, టీ, పంచదార, వోడ్కా, అయిదు రూబుళ్ళు తెచ్చుకుంది. అయిదు రూబుళ్ళుకూడా ఇచ్చినందుకు అతనికి అభివందనలు తెలిపింది. నిజానికి అతను నికిటాకు ఇరవై రూబుళ్ళు ఇవ్వాలి.

'మనం ఎప్పుడైనా ఒకఖరారునామా వ్రాసుకున్నామా? నీకేం కావలిస్తే అది తీసుకో. దానికి పనిచెయ్యి. ఇతరులలాగా నేను లెక్కలుచూస్తూ కూచోలేను. నేను సూటిగా వెళ్ళే మనిషిని. నీవు పనిచెయ్యి. నీపని నేను ఉంచుకోను'. అనేవాడు వాసిలి యాండ్రవిచ్.

ఇలాఅంటూ, తను నికిటాకు ఎంతో సహాం చేస్తున్నానని నికిటాకు అన్నదాతననీ అనుకునేవాడు వాసిలి యాండ్రవిచ్. ఈ విషయాన్ని తనమీద డబ్బుకోసం ఆధారపడి ఉన్నవారందరికీ ఎంతో అందంగానూ, మెత్తగానూ తెలియచేసేవాడు.

వాసిలి యాండ్రవిచ్ ఇలా అన్నప్పుడు, 'అవునయ్యా! మీరు చెప్పింది నిజమే. నా తండ్రికి ఎలా సేవచేస్తానో తమకూ అలాగే సేవ చేస్తాను' అనేవాడు నికిటా. వాసిలియాండ్రవిచ్ తనను మోసం చేస్తున్నాడని నికిటాకు తెలుసు. అయినా తన విషయం అతనితో చెప్పుకుని లాభంలేదని తన లెక్కా డొక్కా

సరిచూచుకోడానికి యత్నించడం అనవసరమని, తనకు మరో దిక్కు లేనప్పుడు తనకు వచ్చిన దానితో సంతృప్తి పడాలనీ అనుకునేవాడు.

'గుర్రం సిద్ధం చెయ్యమని' తన యజమాని ఆజ్ఞ వినగానే గుర్రాలశాలకు పరుగెత్తుకుంటూ వెళ్ళాడు. చీలకు తగిలించి ఉన్న జీను తీసుకుని, జీను గంటలు గలగల లాడించుకుంటూ గుర్రం దగ్గరికి వెళ్ళాడు.

అతన్ని చూడగానే గుర్రం మెల్లగా సకిలించింది. 'ఏం? ఒంటరిగా ఉన్నావా? పాపం! అన్నాడు' గుఱ్ఱంతో. 'ఉండు. కొంచెం దాహం దాగుదుగాని' అన్నాడు గుర్రం తనమాట అర్థంచేసుకుంటూ ఉన్నట్టు. తన కోటుతో గుర్రం వీపు తుడిచాడు. జీనువేసి గుర్రాన్ని నీళ్ళుతాగించడానికి తీసుకునివెళ్ళాడు.

చల్లటినీళ్ళు తాగినతరువాత గుర్రం తడిపెదవులు కదుపుతూ నిశ్వాసించింది. తరువాత నిశ్చలంగా నిల్చుని పెద్దగా సకిలించింది.

'తాగేనీళ్ళు ఇప్పుడే తాగు. మళ్ళీ దార్లో అడవక్కు' అన్నాడు నికిటా. తరువాత గుర్రాన్ని తీసుకుని షెడ్‌లోకి వెళ్ళాడు.

దార్లో ఎవరూ లేరు. వంటమనిషి భర్త మాత్రం ఉన్నాడు, అతను సెలవకు వచ్చాడు.

'లోపలికి వెళ్ళి ఏ బండి కట్టాలో అడిగి రా. మంచివాడివి బాబూ' అన్నాడు నికిటా.

వంటమనిషి లోపలికి వెళ్ళి తిరిగివస్తూ 'చిన్న బండి కట్టమన్నారు?' అన్నాడు. ఈపాటికి నికిటా ముఖోర్తిం (గుర్రంపేరు) పై జీనువేసి నడుముకు బెల్టుపెట్టి సిద్ధంచేశాడు.

'సరే, చిన్న బండే కడతానని చిన్న బండిదగ్గిరికి వెళ్ళి బండి సిద్ధం చెయ్యడం మొదలెట్టాడు. కళ్ళాలు మినహా బండి కట్టడంపూర్తయినతరువాత నికిటా అతన్ని గడ్డికోసం పంపించాడు.

అతను ఎండుగడ్డి తీసుకొచ్చాడు. నికిటా ఎండుగడ్డి బండ్లో పరిచాడు. గడ్డిమీద పరుపు పరిచాడు. కళ్ళాలు బిగించి తను డ్రైవర్ సీట్లో కూచుని బండి గేటు వైపుకు తోలాడు.

'నికిటా మామయ్యా! నికిటా మామయ్యా!' అంటూ ఒక గొంతు ఎలుగెత్తి వినిపించింది. ఒక ఏడేళ్ళ కుర్రాడు పరుగెత్తుకుని వస్తున్నాడు. ఆ కుర్రాడు నల్లటి గొర్రె తోలుతో కుట్టిన కోటు తొడుక్కున్నాడు. కొత్త బూట్లు, చలి టోపీ పెట్టుకున్నాడు 'నేనుకూడా వస్తాను. నన్నుకూడా తీసుకెళ్ళు' అంటూ పరుగెత్తుకుంటూ వచ్చాడు.

'సరే, రా బాబూ' అంటూ నికిటా ఆ కుర్రాణ్ణి బండ్లో ఎక్కించుకున్నాడు. ఆ సన్నటి కుర్రాడు తన యజమాని కొడుకు. నవ్వుముఖంతో ఎంతో అందంగా ఉన్నాడు ఆకుర్రాణ్ణి బండ్లో ఎక్కించుకుని రోడ్డుమీదికి బండి తోలుకుని వెళ్ళాడు.

అప్పటికి మధ్యాహ్నం రెండు గంటలు దాటింది. గాలి బాగా వీస్తోంది. మబ్బుపట్టి రోజు మందంగాఉంది. చలి. మంచు కురుస్తోంది. ఆకాశంలో సగభాగాన్ని దట్టమైన ఒక మబ్బుతెర ఆవరించుకుని దిగివస్తోంది. దొడ్లో ప్రశాంతంగాఉంది. కాని వీధిలో

గాలి మరింత విసురుగా వీస్తోంది. ప్రక్క దొడ్లోనుంచి మంచు తెరవచ్చి సుడిగుండంలా తిరుగుతోంది.

నికిటా దొడ్లోనుంచి ఇంటి ముందుకు బండిశోలి నిల బెట్టగానే వాసిలి యాంద్రవిచ్ వసారాలోకి వచ్చి నిల్చు న్నాడు. సిగరెట్ కాలుస్తున్నాడు. గుడకప్పిన గొర్రె తోలు కోటు తొడుక్కున్నాడు. బూట్లతో మంచు తొక్కుతూ వస్తోంటే చప్పుడవుతూఉంది. చివరిదమ్ము లాగి సిగరెట్ అవ తల పారేశాడు. మీసాల్లోగుండా పొగ విడుస్తూ బండివంక గుర్రంవంక చూచాడు.

'ఈ బడుద్ధాయికూడా ఉన్నాడే!' అన్నాడు బండ్లో కూచున్న కొడుకును చూడగానే. తన అతిథులతో కలిసి తాగిన వోడ్కావల్ల వాసిలి యాంద్రవిచ్ కొంచెం ఉద్రిక్తుడై ఉన్నాడు. అందుకని ఎప్పటికంటెకూడా ఎంతో కులాసాగా కనుపిస్తున్నాడు. తను చేస్తున్న ప్రతిపనీ అతనికి మంచిగా కను పిస్తోంది. తన కుమారుణ్ణి చూడగానే అపరిమితమైన సంతృప్తి కలిగింది. తన కుమారుడు తన వంశోద్ధారకు డవుతాడని ఎప్పుడూ అనుకుంటూ ఉండేవాడు వాసిలి యాంద్రవిచ్. తనకు వీడ్కోలు నివ్వడానికి తన భార్యకూడా ముందు వసారాలోకి వచ్చి నిల్చుంది. గర్భంతో ఉండడంవల్ల సన్నగా పాలిపోయి ఉన్నది. ఒంటినిండా శాలువా కప్పుకున్నది. కళ్ళుతప్ప ముఖం కూడా కనుపించడంలేదు.

'నికిటానుకూడా మీతో తీసుకుని వెళ్ళండి' అన్నది భయంతో ద్వారందగ్గర నిల్చుని.

వాసిలి యాంద్రీవిచ్ సమాధానం చెప్పలేదు. ఆమె మాటలు అతనికి కలవరం కలిగించినమాట మాత్రం నిజం. అతను కోపంతో కనుబొమలు ముడుచుకుని తుబుక్కున ఉమ్మేశాడు.

'మీ దగ్గర డబ్బున్నది. అదీకాక గాలికూడా బాగా లేదు. నా మాటవిని నికటానను తీసుక వెళ్ళండి' అన్నది అదే కంఠస్వరంతో.

'నాకు దారి తెలీదంటావా ఏమిటి?' అన్నాడు వాసిలి యాంద్రీవిచ్. ప్రతి మాటనూ నొక్కి పలుకుతూ ఈ మాటల అంటూ తన పెదవులు అసహజంగా నొక్కుతున్నాడు. కొను గోలుదారులతో మాట్లాడేటప్పుడు అతను సహజంగా ఇలాగే చేస్తాడు.

'నేను మిమ్మల్ని ప్రార్థిస్తున్నాను. నికిటాను తీసుకుని వెళ్ళండి' అన్నదిభార్య మళ్ళీ, శాలువా ముసుగు మరింత బిత్తుగా సవరించుకుంటూ.

'అబ్బ! పట్టుకుంటే జలగలా వదలవేం? ఎక్కడికి తీసుకుని వెళ్ళాలి?' అన్నాడు వాసిలి యాంద్రీవిచ్.

'నేనుకూడా వస్తానయ్యా!' అన్నాడు నికిటా. 'కాని నేను లేనప్పుడు గుర్రాలను జాగర్తగా కనిపెట్టి ఉండాలి' అన్నాడు తన యజమానురాలివంక తిరిగి.

'నేను చూస్తాలే నికిటా. గుర్రాలను జాగర్తగా కనిపెట్టి ఉండమని సైమన్‌తో చెబుతాను' అన్నది యజమానురాలు.

'సరేనమ్మా. అయ్యాగారూ, ఇక నేనుమీతో రావచ్చా?' అన్నాడు నికిటా యజమానితో.

'సరే. మా ఆవిడమాట తప్పించుకోడానికి వీల్లేనట్లు కనుపిస్తోంది. నీవు వచ్చేటట్లవుతే ఇంతకంటె వెచ్చని బట్టలు వేసుకో' అన్నాడు వాసిలి యాంద్రవిచ్, నికిటా చిరుగు కోటు వంక చూచి చిరునవ్వు నవ్వుతూ. ఆ కోటు వీపు దగ్గర బుజాల కింద చిరిగిఉంది. అతని ఒంటికి చిన్నదై బిగుతుగాఉంది. మాసి పోయిఉంది. అతని జీవితంలోని ఎన్నో అనుభవాలను అది భరించినట్టుగా కనుపిస్తోంది.

'అబ్బాయ్! కొంచెం వచ్చి గుర్రాన్ని పట్టుకో'అని బిగ్గరగా కేకేశాడు నికిటా, వంటమనిషి భర్తను.

'నేనే పట్టుకుంటా. నేనే పట్టుకుంటా' అంటూ యజమానిగా రబ్బాయి జేబుల్లోంచి చేతులు తీసి చల్లగాఉన్న తోలు కళ్ళాలు పుచ్చుకున్నాడు.

'ఎక్కువ ఆలస్యం చెయ్యకు. ఒక్క నిమిషంలో బట్టలు వేసుకుని రావాలి' అన్నాడు వాసిలి యాంద్రివిచ్.

'ఒక్క నిమిషంలో వచ్చేస్తా బాబయ్యా' అంటూ నికిటా పనివారి గుడిసెలోకి పరుగెత్తుకుని వెళ్ళాడు. అతని బూట్లుకూడా అతని బట్టల లాగానే చిరిగి ఉన్నాయి.

'అర్సీప్కా! స్టౌవ్ మీదినుంచి నా కోటు తీసుకురా. నేనూ అయ్యగారితో వెడుతున్నాను' అన్నాడు గుడిసెలో ప్రవేశిస్తూ.

విందు ముగిసిన తరువాత వంట మనిషి ఒక నిద్రపోయి లేచి భర్తకోసం టి పెట్టడానికి పొయ్యి సిద్ధంచేస్తోంది. నవ్వు ముఖంతో నికిటా వంక తిరిగి, తనూ త్వరత్వరగా స్టౌమీద ఆరుతూఉన్న పాతకోటు తీసిఇచ్చింది. 'ఇహ నాలుగు రోజులు

నీవూ మీ ఆయనా ఒంటిగా ఉండొచ్చులే' అన్నాడు నికిటా. నికిటా సహజంగా దయార్ద్రహృదయుడు. మంచివాడు. ఒంటిగా ఉన్నప్పుడు ఎవరితోనైనా ఇలాగే పరాచికం ఆడతాడు.

ఆ పాతకోటు తీసుకుని తన సన్నని శరీరం చుట్టూ చుట్టుకున్నాడు

'కాళ్ళకుకూడా ఏదైనా వేసుకోవాలి. నీ బూట్లు బాగా లేవు' అన్నది ఆమె. నికిటా ఈ విషయం హఠాత్తుగా గమనించినట్లు ఆగిపోయాడు.

'అవును. మరిచిపోయాను. కాని ఇవిచాల్లే. ఎక్కువ దూరం వెళ్ళడంలేదుగా' అన్నాడు.

'చలిగాలేదా నికిటా ?' అన్నది యజమానురాలు అతను బండి దగ్గరికి వస్తోంటే.

'చలా? అమ్మగారూ? లేదు. వెచ్చగాఉంది' అన్నాడు నికిటా బండి ముందు భాగంలో కొద్దిగా ఎండుగడ్డి పరుస్తూ. నికిటా బండెక్కి కూచుని కళ్ళాలు చేతులో పుచ్చుకుని వెంటనే గుర్రాన్ని అదిలించాడు. చర్నకోల బండ్లోనే పెట్టాడు. గుర్రం మంచిది కావడంవల్ల చర్నకోలతో అవసరంలేదు.

## 2

రోడ్డు మంచు కురిసి మెత్తగాఉంది గుర్రం మంచి బలమైంది. బండి శరవేగంతో పోతోంది.

'వాడు చూడు, ఇంకా అక్కడేఉన్నాడు. ఆ చర్నకోల ఇలా ఇవ్వు నికిటా' అని బిగ్గరగా కేకేశాడు వాసిలి యాంద్రీవిచ్. తన కొడుకు బండి వెనకాల నిల్చుని ఉండడం చూచాడు.

'ఇది నీ కిస్తాను. అమ్మ దగ్గరికి వెళ్ళరా వెధవ'అన్నాడు.

కుర్రాడు బండ్లోనుంచి దూకాడు. గుర్రం కదను హెచ్చింది.

వాసిలి యాంద్రీవిచ్ నివసించే గ్రామంలో ఆరు పెద్ద ఇండ్లున్నాయి. ఊరి చివరలో కమ్మరివానిగుడిసె ఉంది. కమ్మరి వాని గుడిసెదాటగానే గాలి వారు ఊహించిన దానికంటె మరింత తీవ్రంగా ఉన్నట్టు గమనించారు. మసక మంచులో రోడ్డుకూడా స్పష్టంగా కనుపించడంలేదు. ముందు వెళ్ళిన బండ్ల గాన్లు విడిచి పోయిన చారలను వెంటనే మంచు కప్పేస్తోంది. ప్రక్క నేలకంటె ఎత్తుగా ఉండడంవల్ల మాత్రమే ఇది రోడ్డని తెలుస్తూంది. పొలాలమీద మంచు సుడిగాలిలా తిరుగుతోంది. భూమి ఆకాశం కలిసే దిక్చక్రరేఖ అసలు కనుపించడంలేదు. టెల్యాటిన్ అడవి వట్టి సమయాల్లో శుభ్రంగా కనుపిస్తూ వచ్చేది. ఇప్పుడు మాత్రం అప్పుడప్పుడూ మంచులో నుంచి మసకమసకగా కనుపిస్తోంది. గాలి ఎడమప్రక్క నుంచి తీవ్రంగా వీస్తోంది. గాలికి గుర్రపు జూలు ఒక ప్రక్కకు ఎగిరిపోతోంది. నికిటా గాలి వాలుగా కూచుని ఉండడంవల్ల అతని కోటు కాలరు అతని చెక్కిలికీ ముక్కుకూ అంటుకుని పోతోంది.

వాసిలి యాంద్రీవిచ్‌కి తన గుర్రమంటే ఎంతో గర్వం. ఆ గుర్రం శరవేగంతో పరుగెత్తుతోంది. కాని రోడ్డు మంచులో

తడిసి ఉండడంవల్ల అంత వేగంగా పరుగెత్తడం లేదు. 'గొడ్డు మంచుతో తడిసిఉంది. గుర్రానికి పరుగెత్తే అవకాశంలేదు. ఒకమాటు ఒక అరగంటలో పాషుటినో చేర్చింది.' అన్నాడు.

ఏమిటయ్యా?' అన్నాడు. నికీటా కాలర్ అతని చెవిని కప్పిఉండడంవల్ల అతనికి వాసిలి యాండ్రివిచ్ మాటలు వినిపించలేదు.

'ఒకమాటు ఒక అరగంటలో పాషుటినో వెళ్ళాను' అన్నాడు వాసిలి యాండ్రివిచ్ బిగ్గరగా.

'గుర్రాని కేమయ్యా? రాజా గుర్రం' అన్నాడు. నికిటా.

ఇద్దరూ కాసేపు మౌనంగా ఉన్నారు. వాసిలి యాండ్రివిచ్‌కి ఏదో ఒకటి మాట్లాడాలనిపించింది.

'వాడికి వోడ్కా ఇవ్వొద్దని నీ భార్యతో చెప్పావా?' అన్నాడు బిగ్గరగా తనంత గొప్పవాడితో తెలివిగలవాడితో మాట్లాడే అవకాశం ఇచ్చినందుకు నికిటా తప్పకుండా సంతోషిస్తాడని వాసిలి యాండ్రివిచ్‌కి గట్టి నమ్మకం. తన పరాచికం నికిటాకు బాధ కలిగిస్తుందనికూడా వాసిలి యాండ్రివిచ్ ఆలోచించలేదు.

గాలివల్ల నికిటాకు తనయజమానిమాటలు వినిపించలా. మళ్ళీ తన పరిహాసాన్ని పెద్దగొంతుకతో చెప్పాడు వాసిలి యాండ్రివిచ్.

'వాళ్ళగొడవ వాళ్ళది. వాళ్ళ గొడవల్లో నేను జోక్యం కలిగించుకోను. మాఅబ్బాయిని సరిగా చూస్తే చాలు, అంతే' అన్నాడు నికిటా.

'అయితే సరే. వచ్చే వసంతఋతువులో ఒక గుర్రం కొనదలచుకున్నావా ?' అన్నాడు వాసిలి యాంద్రివిచ్ విషయాన్ని మారుస్తూ.

'అవునయ్యా కొనక తప్పదు.' అన్నాడు నికిటా.

ఇప్పుడు సంభాషణ అతని కెంతో ఇష్టంగా కనిపించింది.

'అవునయ్యా. గుర్రం కూడా పెరిగి పెద్దదవుతూంది. ఇంతవరకూ ఏదో ఒక గుర్రాన్ని అద్దెకు తెచ్చుకుంటున్నాం' అన్నాడు నికిటా.

'ఆ బక్క గుర్రాన్ని తీసుకోరాదూ ? దానికి నేనంత ధర చెప్పను' అన్నాడు వాసిలి యాంద్రివిచ్ బిగ్గరగా. గుర్రాలు అమ్మడం కొనడం అతనికెంతో సరదా. ఎప్పుడూ దాన్ని గురించే ఆలోచిస్తూ ఉంటాడు.

'లేకపోతే నాకో పదిహేను రూబుళ్ళు ఇవ్వండి. గుర్రాల మార్కెట్‌లో నేనొక గుర్రాన్ని కొనుక్కుంటాను' అన్నాడు నికిటా. వాసిలి యాంద్రివిచ్ అమ్మదలుచుకున్న గుర్రానికి ఏడు రూబుళ్ళు ధర ఎక్కువగా చెబుతున్నాడని నికిటా గ్రహించాడు.

'గుర్రం మంచిదోయ్. నేను నా శ్రేయస్సే కాదు, నీ శ్రేయస్సుకూడా ఆలోచించి చెబుతున్నాను. నే నెప్పుడూ ఇతరులకు హానిచేసేవాణ్ణికాదు. నష్టం ఉంటే నేనే భరిస్తాను. నేను ఇతరుల లా కాదు' అన్నాడు వాసిలి యాంద్రివిచ్ బిగ్గరైన గొంతుకతో. అత నిలాంటి మాటలతో కొనుగోలుదారులను మంత్రముగ్ధులను చేస్తుంటాడు.

'సరేనయ్యా' అన్నాడు నికిటా దీర్ఘంగా నిశ్వసిస్తూ. ఇక యజమానితో మాట్లాడేదేమీ లేదనుకున్నాడు.

ఒక అరగంటసేపు ఇద్దరూ మౌనంగా ప్రయాణం చేశారు. నికిటా కోటు చిరిగిఉన్న వైపుగా గాలి సూదులతో పొడుస్తున్నట్టుగా వీస్తోంది.

అతను మెడకు కాలర్ మరింత గట్టిగా చుట్టుకున్నాడు. అందుచేత పూర్తిగా చలి వెయ్యడంలేదు.

'సరాసరి రోడ్డుమీద వెడదామా? లేక కారమిషెవ్ గుండా వెడదామా? ఏమంటావ్?' అన్నాడు వాసిలి యాంద్రీవిచ్.

కారమిషెవ్ గుండా వెళ్ళే రోడ్డుమీద ఎక్కువజనం వెడతారు. రోడ్డుకు ఇరు ప్రక్కలా చెట్లుకూడా నాటిఉన్నాయి. సరాసరి వెళ్ళేదారి దగ్గర. కాని జనం ఆ దారిన ఎక్కువగా వెళ్ళరు.' మీ ఇష్టం' అన్నాడు నికిటా. వాసలి యాంద్రీవిచ్ సరేనని ఒక ఓక్ చెట్టువరకూ బండిని వెళ్ళనిచ్చి ఎడమప్రక్కకు బండి తిప్పాడు.

ఎడమపక్కకు తిరగగానే గాలి ఎదురైంది. మంచు కురవడం మొదలెట్టింది. వాసిలి యాంద్రీవిచ్ గాలి పూరించుకోడానికి బుగ్గలు పెద్దవిచేసి మీసాల్లోనుంచి గాలి వదిలాడు. నికిటాకు కునుకుపట్టింది.

ఇలా మరో పదినిమిషాలు మౌనంగా ప్రయాణం చేశారు. హఠాత్తుగా వాసిలి యాంద్రీవిచ్ ఏదో చెప్పడం మొదలెట్టాడు.

'ఏమిటయ్యాగారూ?' అన్నాడు నికిటా కళ్ళు తెరుస్తూ.

వాసిలి యాండ్రీవిచ్ సమాధానం చెప్పలేదు. కాని ముందుకు వంగి దారి అటూ ఇటూ చూచాడు. ముఖోర్తీ (గుర్రం పేరు) బాగా చెమటపోసింది. అలుపువల్ల మెల్లగా నడుస్తోంది.

'ఏమిటయ్యాగారూ?' అన్నాడు నికిటా.

'ఏమిటంటావేం? ఒక చెట్టుకూడా కనిపించడంలేదు. మనం దోవతప్పాం' అన్నాడు వాసిలియాండ్రివిచ్.

'అయితే బండి ఆపండి, నేను బండిదిగి చూస్తాను' అన్నాడు నికిటా మెల్లగా బండ్లోనుంచి దూకుతూ. బండి దిగి ఎడమవైపుకు వెళ్ళాడు.

ఆ సంవత్సరం మంచు ఎక్కువగాలేదు, అందుచేత నడవడానికి ఎక్కడైనా వీలవుతున్నది. కాని కొన్నిచోట్లమాత్రం మోకాటిలోతు మంచు ఉంది. నికిటా బూట్లలో ఇరుక్కుంది. కాళ్ళతో నేల వెదుకుతూ వెళ్ళాడు. కాని దారి ఎక్కడా కనుపించలేదు.

నికిటా బండిదగ్గరికి తిరిగిరాగానే, 'ఇప్పుడేం, చెయ్యాలి?' అన్నాడు వాసిలి యాండ్రీవిచ్.

'ఇటువైపు రోడ్డు కనిపించడంలేదు. ఇక అటువైపు వెళ్ళి చూడాలి' అన్నాడు నికిటా.

'ముందు ఏదో దారి కనుపిస్తున్నట్టుగా ఉంది. వెళ్ళి చూడు' అన్నాడు వాసిలియాండ్రివిచ్.

నికిటా అటువైపు వెళ్ళాడు. ముందు ఏదో నల్లగా కనుపిస్తోంది. కాని తీరా వెళ్ళి చూచేసరికి అది మట్టికుప్ప.

గాలికి పొలాల్లోనుంచి కొట్టుకుని వచ్చింది. కుడివైపుగూడా వెదికి బండి దగ్గరికి తిరిగి వచ్చాడు. కోటుమీదనుంచు తుడుచుకుని బూట్లలో మంచు దులుపుకుని బండెక్కి కూచున్నాడు.

'ఇక మనం కుడివైపుకు వెళ్ళాల్సిందే' అన్నాడు నిశ్చయంగా. 'ఇదివరకు గాలి ఎడమవైపునుంచి వీస్తోంది. ఇప్పుడు సరిగా ముఖానికి ఎదురుగా వీస్తోంది. కుడివైపుకు బండి తోలండి' అన్నాడు.

వాసిలియాంద్రీవిచ్ అతని సలహాప్రకారం కుడివైపుకు బండి తిప్పాడు. కాని రోడ్డు కనుపించలేదు. అదేవైపు కొంత దూరం ప్రయాణం సాగించారు. గాలి ఎప్పటిలాగానే భీకరంగా వీస్తోంది. మంచు మెల్లగా కురుస్తోంది.

'దోవ తప్పి చాలాదూరం వచ్చినట్టున్నాం' అన్నాడు నికీటా. మంచులోగుండా పైకి కనుపిస్తూఉన్న బంగాళదుంప తీగలుచూచి 'అదేమిటి' అన్నాడు.

వాసిలియాంద్రీవిచ్ అలిసిపోయి రొప్పుతూ ఉన్న గుర్రాన్ని ఆపాడు.

'ఏమిటది ?'

'ఏముంది ? జఖరొవ్ భూముల్లోకి వచ్చేశాం.'

'ఎక్కడికి వచ్చామో చూచారా ?' అన్నాడు నికిటా.

'అబద్ధం' అన్నాడు వాసిలియాంద్రీవిచ్.

'అబద్ధం కా దయ్యగారూ. నిజం మన బండి బంగాళా దుంపల పొలంలోగుండా వెడుతూఉంది. ఇది జఖరొవ్ ఫ్యాక్టరీ భూమి' అన్నాడు నికిటా.

'అయ్యో రామ! ఎంత దూరం దోవ తప్పి వచ్చాం! ఇప్పుడేం చెయ్యాలి?' అన్నాడు వాసిలియాంద్రివిచ్ ఆశ్చర్యంతో.

'మనం సూటిగా వెళ్ళాలి. అంటే ఎక్కడో ఒకచోట తేలుతాం' అన్నాడు నికిటా.

వాసిలియాంద్రివిచ్ అతని సలహా ఒప్పుకుని నికిటా చెప్పిన దోవన బండి పోనిచ్చాడు.

ఇలా కొంతదూరం వెళ్ళారు. మధ్యలో కొన్ని బీళ్ళు వచ్చాయి. బండి బీళ్ళలో పోతోంటే పగులు బాసిఉన్న భూమి తగిలింది. మట్టిమీద మంచుగడ్డలు పడి ఉన్నాయి. మధ్య మధ్యలో నల్లనేల, పసుపునేల వచ్చేది. అక్కడక్కడ నాగు జెముడు మంచులోనుంచి కనుపిస్తోంది.

ఒక్కొకప్పుడు తెల్లని పెద్ద మంచుతెర అడ్డువచ్చేది. ఆ మంచు అడ్డు వచ్చినప్పుడు అవతల ఏమీ కనుపించేదికాదు.

పైనుంచి మంచు కురుస్తోంది. ఒక్కోసారి క్రిందినుంచి పైకి ఉబికివస్తోంది. గుర్రం బాగా అలసిపోయింది. చెమటవల్ల గుర్రపు జూలు ఒంటికి అంటుకపోతూంది. ఒంటినిండా మంచు తుప్పర. గుర్రం మెల్లగా అడుగువేస్తోంది.

అలసిపోయిన గుర్రం హఠాత్తుగా ఒక గుంటలో కుప్ప కూలింది. వాసిలియాంద్రివిచ్ బండి ఆపుచేదామనుకున్నాడు. కాని నికిటా 'ఎందుకు ఆపుతారు,' అని అరిచి గుర్రాన్ని 'లే, లే' అని లేవగొట్టాడు. తనూ బండినుంచి గుంటలోకి దిగాడు.

గుర్రం ఒక్క పరుగులో గుంటలోనుంచి పైకిలేచింది.

"ఇప్పుడు మనం ఎక్కడున్నట్టు?" అన్నాడు వాసిలి యాంద్రవిచ్.

"పదండి. మనకే తెలుస్తుంది" అన్నాడు నికిటా.

వాసిలియాంద్రివిచ్ వారిముందు మంచులోనుంచి నల్లగా కనుపిస్తున్న ఒక వస్తువు వంక చూపుతూ, 'ఇది గోర్యాష్కిన్ అడవిలాగుంది' అన్నాడు.

"అక్కడికి చేరితే ఏ అడవైనదీ తెలుస్తుంది" అన్నాడు నికిటా.

ఆ నల్లటి వస్తువు వెనక కొన్ని పొడుగాటి సరుకుచెట్లు కనుపిస్తున్నాయి. ఆ చెట్లకు ఆకులు ఆట్టే లేవు. అది అడవి కాదు. ఒక సెటిలో మెంటు అయిఉంటుందని ఊహించాడు నికిటా. కాని బైటికి తన యజమానితో ఆ మాట చెప్పలేదు. వాళ్ళు బురదగుంటదాటి ఇంకా ఇరవై అయిదు గజాలైనా రాలేదు. అప్పుడే వారి కంటిముందు నల్లటి వృక్షాలు కనిపించాయి. ఏదో ఒక కొత్తశబ్దం, విషాదకరంగా వినిపించడం మొదలెట్టింది. నికిటా ఊహించింది నిజమే. అది అడవి కాదు. పొడ్డిగా ఆకులున్న పొడుగైన వృక్షాల వరుసలు తీరి కనిపిస్తున్నాయి. ఆగుంటచుట్టూ వాటిని నాటి ఉంటారు. గాలిలో నుంచి ఆ సరుకుచెట్ల సంగీతం మూలుగులాగా వినిపిస్తోంది. బండి ఆ చెట్ల దగ్గరికి చేరగానే గుర్రం ముందు కాళ్ళు పైకెత్తి మెట్ట మీదికి బండిని పరిగెత్తించింది. మళ్ళీ రోడ్డుచేరారు.

"అమ్మయ్యా! రోడ్డు చేరారు. కాని ఇప్పుడు ఎక్కడున్నట్టు?" అన్నాడు నికిటా.

మరో వందగజాలు వెళ్ళగానే బారన్ నల్లటి గోడకనిపించింది. చూరులో నుంచి మంచు రాలుతోంది. బారన్ దాటగానే రోడ్డుకు గాలి ఎదురైంది. వారిముందు ఇరుప్రక్కలా ఇండ్ల వరుసలు కనుపించాయి. బండి ఒక మంచు ప్రవాహంలోకి వెళ్ళింది. మంచుప్రవాహంలోనుంచి బండినిపోనిచ్చి ఒకవీధిలోకి వచ్చారు. గ్రామానికి చివరిఇంటి దగ్గరికి వచ్చారు. ఇంటిముందు కొన్ని మంచులో గడకట్టిన బట్టలు, చొక్కాలు, లాగులు, కోట్లు గాలికి అల్లలాడుతున్నాయి. తెల్లపట్ట మరీ అల్లలాడుతున్నది.

## 3

వీధిమొగదల గాలి మరీ భీకరంగా వీస్తోంది. రోడ్డుమీద మంచు దట్టంగా పరుచుకుని ఉంది. గ్రామంలోపలమాత్రం ప్రశాంతంగా వెచ్చగా హాయిగా ఉంది. ఒక ఇంటిముందు కుక్క మొరుగుతోంది. మరో ఇంట్లోనుంచి ఒక స్త్రీ నెత్తికి కోటుకప్పుకుని పరుగెత్తుకువచ్చి ఒక గుడిసెలో దూరింది. గుడిసెలో వెడుతూ వాకిటిదగ్గర ఆగి వెడుతున్న గుర్రపుబండిని చూచింది. గ్రామం నడిబొడ్డున ఆడపిల్లలు పాడుతున్న పాటలు వినిస్తున్నాయి.

గ్రామంలో గాలి అంత ఎక్కువగా లేదు. మంచుకూడా ఒళ్ళుకొరకడం లేదు.

'ఇది గ్రిష్కినో గ్రామంలాగుంది' అన్నాడు వాసిలి యాండ్రివిచ్.

'అలాగే ఉంది' అన్నాడు నికిటా.

అది నిజంగా గ్రిష్కినో గ్రామమే. అంటే వాళ్ళు ఎడమ ప్రక్క చాలా దూరం ప్రయాణం చేశారన్నమాట. ఇంచుమించు ఆరుమైళ్ళయినా వచ్చి ఉంటారు.

గ్రిష్కినో నుంచి గోర్యాష్కిన్ గ్రామానికి ఇంకా నాలుగుమైళ్ళదూరం ఉంది.

గ్రామ మధ్యం చేరేసరికి వీధి మధ్యలోగుండా ఒక పొడుగాటి వ్యక్తి రావడం కనుపించింది.

'ఎవరు మీరు?' అని కేకేశాడు ఆ వ్యక్తి గుర్రాన్ని ఆపుతూ. అతను వాసిలియాంద్రివిచ్‌ని చూచి గుర్తించి బండి తోలేవాని సీటు ఎక్కి కూచున్నాడు.

అతని పేరు ఇసే. వాసిలియాంద్రివిచ్‌కి పరిచయుండున్న ఒక రైతు అతను. ఆ జిల్లాలో పేరుపడ్డ గుర్రాల దొంగ. 'నీవటయ్యా వాసిలియాంద్రివిచ్! ఎక్కడికి వెడుతున్నావ్?' అన్నాడు. అతను తాగిన వోడ్కా వాసన నికిటా ముక్కులు బద్దలు చేసేసింది.

'గోర్యాష్కిన్ గ్రామం వెడుతున్నాం.'

'మరి, ఇలా వచ్చారేం? మాల్‌షన్ వోకా గుండా వెళ్ళవలసింది,' అన్నాడు ఇసే.

'అవును. అలాగే వెళ్ళవలసింది. కాని వెళ్ళలేకపోయాం?' అన్నాడు వాసిలియాంద్రివిచ్.

'గుర్రం మంచిది' అన్నాడు ఇసే గుర్రం వంక చూస్తూ.

'ఇవాళ రాత్రికి ఇక్కడ ఆగుతారా?'

'లేదుబాబూ. వెళ్ళాలి'.

'చాలా అవసరమైన పనుందనుకుంటాను. ఇత నెవరు ? ఓ నికిటా !'

'ఇంకేవ రనుకున్నావ్ ?' అన్నాడు నికిటా.

'సరే ఈసారి దోవ తప్పకుండా ఉండడం ఎలాగో చెప్పు' అన్నాడు నికిటా.

'ఇక్కడ ఇహ ఎలా దోవ తప్పుతారు ? వెనక్కు తిరిగి సూటిగా వెళ్ళండి. వీధి చివర చేరగానేకూడా అలాగే వెళ్ళండి. ఎడమప్రక్కకు వెళ్ళకండి. హైరోడ్డుమీదికి రాగానే కుడిప్రక్కకు తిరగండి.'

'హైరోడ్డుమీదికి ఎలా తిరగాలి ? వేసవికాలంలో వెళ్ళే దారిలో తిరగమంటావా ? చలికాలంలో వెళ్ళే దారిన తిరగమంటావా ?'

'చలికాలం వెళ్ళే దార్లో తిరుగు. నీవు తిరగగానే కొన్ని పొదలు కనుపిస్తాయి. వాటికి ఎదురుగా ఒక దారి గుర్తు కనుపిస్తుంది. ఒక పెద్ద ఓక్ వృక్షం కనుపిస్తుంది. అదీ దారి.' వాసిలియాంద్రివిచ్ బండి వెనక్కు తిప్పి గ్రామం బైటికి పోనిచ్చాడు.

'ఇవాళ రాత్రికి ఉండిపోగూడదు ?' అని అరిచాడు. ఇసే వెనుకనుంచి.

కాని వాసిలియాంద్రివిచ్ సమాధానం చెప్పకుండా బండిని పోనిచ్చాడు. రోడ్డు నాలుగు మైళ్ళు. రెండు మైళ్ళు అడవిలోనుంచి వెళ్ళాలి. గాలి కొంచెం మందగించింది.

మంచు కురవడంకూడా తగ్గింది. అందుచేత ప్రయాణం సుల భంగా కనుపించింది.

వాసిలి యాండ్రివిచ్ గ్రామవీధిలోనుంచి బండిపో నిచ్చాడు. వీధిలో అక్కడక్కడా నల్లని ఎరువుగుట్టలు, కొట ఆరకట్టిన బట్టలు కనుపించాయి. మళ్ళీ మూలుగుతున్న సరుకు చెట్ల దాపుకు చేరారు. చెట్లుదాటి బీడుభూముల్లో ప్రవేశిం చారు. మళ్ళీ మంచుతుఫాను మొదలెట్టింది. భీకరంగా వీస్తోంది. రోడ్డుమీద మంచు నదిలా ప్రవహిస్తోంది. ఇరుప్రక్కలా చెట్ల వల్లమాత్రమే దోవతప్పలేదని తెలుస్తోంది. ముందున్న చెట్లు కూడా అంత సరిగా కనుపించడంలేదు. గాలి ముఖాలపైకి వీస్తోంది.

వాసిలి యాండ్రివిచ్ కనుబొమలు ముడిచి ఎంతో దీక్షతో దోవకోసం వెదుకుతున్నాడు. గుర్రం తెలివిగలది కాబట్టి దోవతప్పదనుకున్నాడు. గుర్రం నిజంగా చాలా తెలివి గలది. రోడ్డు తప్పకుండా పోతుంది. రాను రాను మంచు ఎక్కు వవుతూంది. ఎదురుగాలికూడా ఎక్కువైంది. ఇంకా ఇరు ప్రక్క లా దోవగుర్తులు కనుపిస్తూనే ఉన్నాయి.

ఇలా పదినిమిషాలు ప్రయాణంచేశారు. హఠాత్తుగా గాలికి కొట్టుకుని వస్తున్న మంచు తెరలోనుంచి ఏదో ఒక నల్లటి వస్తువు కనుపించింది.

అది మరో గుర్రపుబండి. వాసిలియాండ్రివిచ్ బండి దానికంటె ముందుగా పరుగెత్తింది. 'వెళ్ళండి! ముందు వెళ్ళండి!' అని ఆబండ్లోనుంచి గొంతుకలు వినిపించాయి. ఆ బండిని వెళ్ళనివ్వ డానికి తన బండి పక్కకు మరలించాడు.

వాసవియాం్రివిచ్. ఆ బండ్లో మగ్గురు పురుషులు, ఒక స్త్రీ ఉన్నారు, ఏదో విందుకు వెళ్ళి తిరిగివస్తున్నట్టున్నారు. స్త్రీ పూర్తిగా ముసుగు కప్పుకుని ఉంది. ముసుగునిండా మంచు అంటుకునిఉంది. ఆమె తూగుతూ కూచునివుంది.

'ఎవరు మీారు?' కేకేశాడు వాసిలి యాం్రడివిచ్.

'మేము...' తరువాత వినిపించలేదు.

'ఎక్కడినుంచి వస్తున్నారు?' మళ్ళీ కేకేశాడు వాసిలి యాం్రడివిచ్.

'ఆ' నుంచి ఒకరైతు బిగ్గరగా కేకేశాడు, కాని వాళ్లెవరో ఇంకా అర్థంకాలేదు వాసిలి యాం్రడివిచ్‌కి.

'మీారు విందునించి వస్తున్నారనుకుంటాను.'

'సెమన్! బండి ఇంకా వేగంగాపోనీ! ఇంకా!' రెండు బండ్లగాన్లు ఒకదానికొకటి రాచుకున్నాయి. నలిగి నున్నమై పోయేవేకాని ఎలాగో తప్పించారు. కొత్తబండి వెనకబడింది.

ఆ బండికి కట్టిన గుర్రం లావుగా పొట్టిగా ఉంది. మంచులో బాగా తడిసింది. అలుపుతో రొప్పుతోంది.

'గుర్రంచూడండి ఎలా అలిసిందో! బాగా తాగి ఒళ్ళు తెలీకుండా తోలారు, రాక్షసులు' అన్నాడు నికిటా.

కొద్ది నిమిషాలవరకూ బాగా అలిసిపోయిన ఆ గుర్రపు రొప్పు, ఆ బండ్లో రైతులకేకలూ వినిపించాయి. తరువాత కాసేపు నిశ్శబ్దం. గాలి ఈలవేస్తూ వీస్తోంది.

ఈ సంఘటన వాసిలియాం్రడివిచ్‌కి కొంచెం ఉత్సాహం కలగజేసింది. మరింత ధైర్యంతో గుర్రమీాదభారం వదిలేశి దోవగుర్తులుకూడా చూడకుండా బండిపోనిచ్చాడు.

ఇలాంటిసందర్భాలలో నికిటా ఎలాంటిజోక్యమూ, కలిగించుకోడు తాపీగా నిద్రపోయాడు. హఠాత్తుగా గుర్రం ఆగిపోయింది. నికిటా ముందుకు పడబోయాడు.

'మళ్ళీ దోవతప్పినట్టుగా ఉన్నాం' అన్నాడు వాసిలియాంద్రివిచ్.

'ఎలా?'

'దోవ గుర్తులు కనుపించడంలేదు. రోడ్డు తప్పివచ్చినట్టున్నాం.'

'సరే దోవ కనుక్కుందాం' అని బండిదిగి మళ్లీ దోవ వెదకడానికి మంచులో బయలుదేరాడు నికిటా.

చాలాసేపు ఆ మంచులో దోవకోసం వెదికాడు. కాసేపు కనిపించే వాడు కాసే, ప్రమాయమయ్యేవాడు. చివరకు తిరిగివచ్చాడు.

'ఇక్కడ రోడ్డు కనుపించడంలేదు, దూరం వెళ్ళవలసి ఉంటుంది' అన్నాడు బండెక్కుతూ. అప్పటికే చీకటిపడుతోంది. మంచు తుఫాను ఎక్కువకాలేదు. కాని తగ్గలేదుకూడా.

'ముందు వెళ్ళిన ఆ రైతుల బండి కనుపిస్తేబాగుండు' అన్నాడు వాసిలియాంద్రివిచ్.

'మనకు వాళ్ళు చాలా దూరంలో ఉండిఉంటారు. లేక వాళ్ళుకూడా దోవ తప్పిఉంటారు.'

'అయితే ఇప్పుడు మనం ఎక్కడికి వెళ్ళేట్టు?' అన్నాడు వాసిలియాంద్రివిచ్.

'గుర్రం ఎటు వెడితే అటు వెళ్ళనివ్వండి. మళ్లీ అదే దోవ పడుతుంది. ఉండండి, నేను కళ్ళాలు పుచ్చుకుంటాను,' అన్నాడు నికిటా.

నికిటా మెల్లగా కళ్ళాలు చేతులోకి తీసుకున్నాడు. గుర్రం నిజంగా తెలివిగలదే. నికిటా కళ్ళాలు తీసుకున్నట్టు గమనించినట్టుగా చెవులు ఆడించింది.

'దీనికి మాటలురావు కాని చాలా తెలివిగలది. చూడండి, ఎలాపోతుందో' అన్నాడు నికిటా.

ఇప్పుడు గాలి వెనకనుంచి వీస్తోంది. అందుకని గుర్రానికి కొంచెం వెచ్చగా ఉంది.

'అవును. మన గుర్రం చాలా తెలివిగలది. కిర్గిజ్ గుర్రం బలంగా ఉంటుంది. కాని వట్టి మొద్దు. కాని, మన గుర్రం చూడండి, చెవు లెలా ఆడిస్తోందో! దీనికి ఎవరూ టెలిగ్రాంకూడా ఇవ్వక్కర్లేదు. ఒక్కమైలు దూరంలో ఉండగానే విషయం కనిపెట్టేస్తుంది' అన్నాడు నికిటా.

ఒక అరగంట ప్రయాణంచేసిన తరువాత వారి ముందు ఏదో నల్లగా కనుపించింది. అది ఒక అడవి కావచ్చు లేక ఒక గ్రామం కావచ్చు. మళ్ళీ కుడిప్రక్కన ఒ దోవ గుర్తులు కనుపించాయి. మళ్ళీ రోడ్డు చేరారు.

'ఇదేమిటి ? మళ్ళీ గ్రిష్కినో వచ్చినట్టున్నాం,' అన్నాడు నికిటా.

నిజంగా మళ్ళీ అదే గ్రామానికి వచ్చారు. అదే బారక్ కనుపించింది. మళ్ళీ ఇంటిముందుఉన్న పట్టులు, లాంగులు కనుపించాయి. ఇంకా అవి నిరాధారంగా నుంచులో ఎగురుతున్నాయి.

మళ్ళీ అదే వీధిలో ప్రవేశించారు. గ్రామంలో ప్రవేశించగానే కాస్త హాయిగా వెచ్చగా ఉంది. ఎరువులకుప్పలున్న వీధి కనుపించింది. ఆడపిల్లల పాట, కుక్క మొరగడం వినిపించాయి. అప్పటికి బాగా చీకటిపడింది. కొన్ని ఇండ్ల కిటికీలలోనుంచి దీపాలు కనుపిస్తున్నాయి.

గ్రామంలో సగందూరం వచ్చినతరువాత ఇటుకలతో కట్టిన ఒక పెద్ద ఇంటిముందు బండి ఆపుచేశాడు వాసిలియాంద్రీవిచ్.

నికిటా కిటికీదగ్గరకు వెళ్ళి చర్నకోలమొనతో కిటికీ తట్టాడు.

'ఎవరు' లోపలనుంచి గొంతు వినిపించింది.

'క్రెస్టీనుంచి వస్తున్నాం. ఒక్కమాటు బైటికిరండి' అన్నాడు నికిటా.

కిటికీదగ్గరనుంచి ఎవరో కదిలినట్టు కనుపించింది. ఒక రెండునిమిషాల తరువాత ద్వారబంధం తెరుచుకుంది. ఒక పొడుగాటి తెల్లనిగడ్డం ఉన్న రైతు బైటికివచ్చాడు. గొర్రె తోలు కోటు వేసుకున్నాడు. ఆ రైతు వెనకాలే ఒక కుర్రాడు కూడా వచ్చి నిలుచున్నాడు.

'నీవా ఆంద్రీవిచ్!' అన్నాడు ముసలి రైతు.

'అవును. నేనే, దోవతప్పాం. గోర్యాష్కినకు వెడదాం అని బయలుదేరి ఇక్కడికి చేరాం. మళ్ళీ బయలుదేరి మళ్ళీ ఇక్కడికే చేరాం' అన్నాడు వాసిలియాంద్రివిచ్.

'అయ్యో! ఎంత దూరం దోవ తప్పారు!' అని ఆ ముసలిరైతు తన వెనకాల నిల్చున్న కుర్రాడి వంక తిరిగి, 'పెట్రూష్కా! వెళ్ళి గేటు తెరు' అన్నాడు.

'కాని ఇవాళ రాత్రికి మేము ఇక్కడ ఉండబోవడం లేదు?' అన్నాడు వాసిలియాంద్రివిచ్.

'ఈ రాత్రి ఎక్కడికి వెడతారు, ఇక్కడే ఉండండి?' అన్నాడు ముసలిరైతు.

'ఇక్కడ ఉండడం నాకు ఇష్టమే, కాని అవసరమైన పనుంది?' అన్నాడు వాసిలియాంద్రివిచ్.

'పోనీ కాసేపు విశ్రాంతి తీసుకుని వెళ్ళండి. టీ కాగుతోంది' అన్నాడు ముసలిరైతు.

'సరే. కాసేపట్లో చంద్రోదయంకూడా అవుతుంది. లోపలికివెళ్ళి కాసేపు విశ్రాంతి తీసుకుందాంపద నికిటా' అన్నాడు వాసిలియాంద్రివిచ్.

'సరే' అన్నాడు నికిటా. నికిటాకుకూడా కాసేపు వెచ్చగా విశ్రాంతి తీసుకోవాలని ఎంతో ఆతురతగా ఉంది.

వాసిలియాంద్రివిచ్ ఆ ముసలి రైతుతో కలిసి ఒక గదిలోకి వెళ్ళాడు. పెట్రూష్కా తెరచిన గేటులోగుండా నికిటా బండిలోపలికి తోలుకునివచ్చి బండి పంచలో ఆపాడు.

నేలమీద ఎరువు పరచి ఉంది. కోళ్ళు అటూ ఇటూ తిరుగుతున్నాయి. నిద్రపోతున్న గొర్రెలు లేచాయి. కుక్క భయంతో, కోపంతో, పెద్దగా మొరగడం మొదలెట్టింది.

నికిటా ఈ జంతువు లన్నిటితో పరిచయం ఉన్నట్టుగా ఏవేవో మాటలుమాట్లాడాడు. గొర్రెలతో 'ఎందుకు భయం?' అన్నాడు. గుర్రాన్ని కట్టేస్తూ కుక్కను బుజ్జగించాడు.

'అలా అరవకు మొద్దూ, మేము శత్రువులం కాదు. స్నేహితులమే' అన్నాడు.

'వీటిని ఇంటికి సలహాదారు లంటారు.' అన్నాడు కుర్రాడు.

'సలహాదారులంటే?' అని అడిగాడు నికిటా.

''ఇంటికి ఒక దొంగ వస్తాడనుకో. 'జాగ్రత్తగాఉండాలి' అంటూ కుక్క మొరుగుతుంది. కోడి, నిద్ర లేవండి అన్నట్టుగా కూస్తుంది.

పిల్లి నాకుతూ, ఎవరో అతిథి వచ్చినట్టున్నాడు. 'ఆహ్వానించడానికి లేవండి' అంటుంది?'' అన్నాడు కుర్రాడు నవ్వుతూ.

పెటూష్కాకు వ్రాయడం చదవడం వచ్చు. అతను చెప్పిన మాటలన్నీ పాల్సన్ ప్రైమరీ పుస్తకంలో తను చదువుకున్నవి. అతను ఆ పుస్తకాన్నంతా బట్టీ పెట్టాడు. అప్పుడప్పుడు ఆ సంగతులన్నీ చెబుతూ ఉంటాడు. ముఖ్యంగా ఇవాలిటిలాగా తాగి ఉన్నప్పుడు ఆ విషయాలు చెబుతాడు.

'అలాగా' అన్నాడు నికిటా.

'నీకు బాగా చలిగా ఉన్నట్టుంది' అన్నాడు పెట్రూష్కా.

'అవును' అన్నాడు నికిటా. ఇద్దరూ ఇంట్లోకి వెళ్ళారు.

# 4

ఆ ఊళ్ళోకల్లా శ్రీమంతుల ఇండ్లలో ఆ ఇల్లొకటి. ఆ ఇంట్లో ఆ కుటుంబానికంతా అయిదు ప్రత్యేక భాగాలున్నాయి. కొంత అద్దెకు ఇచ్చారు. ఆరుగుర్రాలు, మూడు ఆవులు, రెండుదూడలు, ఇరవై గొర్రెలు ఉన్నాయి. కుటుంబాలో మొత్తం ఇరవై ఇద్దరు ఉన్నారు. నలుగురు కొడుకులకు పెళ్ళి ళ్ళయినాయి. ఆరుగురు మనమళ్ళు. పెట్రూషా_కూడా ఒక మనుమడు, అతనికికూడా అప్పుడే పెళ్ళయింది. ఇద్దరు ముని మనుమాళ్ళున్నారు. ముగ్గురు అనాధులు, నలుగురు కోడళ్ళూ— వారి పిల్లలూ, ఇంటినిండా గుంపులుగా ఉన్నారు. కుటుంబ మంతా కలిసే ఉంటోంది. ఇంకా విభక్తం కాలేదు. అయినా కుటుంబంలో విచ్ఛిత్తి నెమ్మదినెమ్మదిగా ప్రారంభిస్తోంది. ఏ కుటుంబంలో గొడవలు, విచ్ఛిత్తి మొలకెత్తినా ఆడవాళ్ళలోనే మొలకెత్తుతాయి. ఇద్దరుకొడుకులు మాస్కోలో నీరు మోసే వారుగా పనిచేస్తున్నారు. వారిలో ఒకడు సైన్యంలో ఉంటు న్నాడు. ఇంట్లో ఇప్పుడు ముసలిరైతు, అతనిభార్య, రెండో కొడుకూ ఉంటున్నారు, రెండోకొడుకు కుటుంబ వ్యవహారా లన్నీ చూచుకుంటాడు. సెలవులకు మాస్కోనుంచి వచ్చిన పెద్దకొడుకుకూడా ఉన్నాడు. ఇంకా ఆడవాళ్ళూ, పిల్లలూ. వీరు కాక మరో అతిధికూడా ఉన్నాడు.

గదిలో టేబిల్ ఉంది. టేబిల్ మీద ఒక లాంతరు వేలా డుతోంది. టేబిల్ మీద టీ కప్పులు, ప్లేట్లు, ఒక వోడ్కా సీసా,

కొన్ని తినుబండారాలు ఉన్నాయి. గోడలు ఇటుకలతో కట్టి నవి. ఒకమూల దేవుని విగ్రహాలూ, బొమ్మలూ, పటాలూ ఉన్నాయి. టేబిల్ మొదట్లో వాసిలియాంద్రీవిచ్ నల్లని గొర్రెతోలు కోటు తొడుక్కొని మంచుతో తడిసిఉన్న తన మీసాలు కొరుక్కుంటూ కూచున్నాడు. తన చుట్టూ ఉన్న మనుష్యులనూ గది నలుమూలలూ పరిశీలిస్తున్నాడు. అతనితో కలిసి ఆ ఇంటి యజమానీ కూచున్నాడు యజమాని వృద్ధుడు. బట్టతల. తెల్లని గడ్డం. అతని ప్రక్క సెలవులకు మాస్కోనుంచి ఇంటికి వచ్చిన కొడుకు కూచున్నాడు. మనిషి బలంగా దృఢంగాఉన్నాడు. రంగుచొక్కా వేసుకున్నాడు. అతనిప్రక్క కుటుంబ వ్యవహారమంతా చూచుకుంటున్న రెండో కొడుకు కూచున్నాడు. అందరికీ కడపట పొరుగింటి అతిథి కూచున్నాడు.

అందరూ వోడ్కా పుచ్చుకోడం ముగించారు. కొద్దిగా ఫలహారంచేశారు. టీ తీసుకోబోతున్నారు. టీ నీళ్ళు కాగు తున్న చప్పుడు వినిపిస్తోంది. అక్కడ పిల్లలు కనుపిస్తున్నారు. ఒక స్త్రీ కూచునిఉంది. ఆ స్త్రీ ప్రక్కనే ఉయ్యాల ముసలి దైన ఇంటి యజమానురాలు వాసిలియాంద్రీవిచ్ కి వంకావాలో కనుక్కుంటూంది. ఆమె ముఖం బాగా ముడతలుపడి ఉంది. పెదవులుకూడా ముడతలుపడ్డాయి.

నికటా ఇంట్లో అడుగుపెట్టగానే ఆమె తన అతిథికి ఒక గ్లాసులో వోడ్కాపోసి అందివ్వడం చూచాడు.

'వద్దనకు, వాసిలి యాంద్రీవిచ్! మాతోకలిసి నీవూ విందుఆనందం పంచుకోవాలి. తాగు' అంటున్నది.

వోడ్కా చూడగానే, దానివాసన తగలగానే నికిటా మనస్సు చలించింది. అదీకాక చలిబాధవల్ల అతను బాగా అలిసిపోయి ఉన్నాడు. కోటుకూ, టోపీకి అంటుకుని ఉన్న మంచు దులిపి దేవుళ్ళవిగ్రహాలవద్దకు వెళ్ళి నమస్కారం చేశాడు. తరువాత ఇంటియజమాని వైపు తిరిగి నమస్కరించి మంచుతో తడిసిన బట్టలు విప్పడం మొదలెట్టాడు.

మంచుతో తడిసిఉన్న అతని ముఖంవంక, కళ్ళవంక, గడ్డంవంక చూచి 'మంచులో బాగా తడిశావే తాతా' అన్నాడు పెద్దకొడుకు.

నికిటా కోటు తీసి దులిపి పొయ్యి ప్రక్కగా తగిలించి, టేబిల్ దగ్గరకువచ్చి కూచున్నాడు. అతనికీ వోడ్కా ఇచ్చారు.

ఒక్కనిమిషం ఆలోచించి గ్లాసు పెదవులదగ్గర ఉంచి వాసిలియాంద్రీవిచ్ వంక చూచాడు; తనింక తాగనని చేసిన ప్రమాణం జ్ఞాపకం వచ్చింది. తన బూట్లు అమ్మి తాగిన రోజూ, తన భార్యతో ఉంటున్న వ్యక్తి, తన కొడుకు, తన కొడుక్కు గుర్రాన్ని కొనిస్తానని తాను వాగ్దానం చెయ్యడం అన్నీ జ్ఞాపకం వచ్చాయి. గ్లాసు కింద పెట్టేసి తాగనన్నాడు.

'నేను తాగను క్షమించాలి' అన్నాడు.

'అదేమి? తాగనంటున్నావు?' అన్నాడు పెద్దకొడుకు.

'నేను తాగను, అంతే' అన్నాడు నికిటా కళ్ళెత్తి చూడకుండా. తన ముందుఉన్న రొట్టెవంక చూస్తూ మీసాల్లో ఇరుక్కున్న మంచు బొట్లు తుడుచుకుంటున్నాడు.

'అతనికి తాగుడు పడదు' అన్నాడు వాసిలియాంద్రీవిచ్ తన గ్లాసు ఖాళీచేస్తూ.

'అయితే కొంచెం టీ తీసుకో' అన్నది ముసలిరైతు భార్య. పొయ్యిదగ్గరఉన్న ఆడవాళ్ళ వంక తిరిగి 'ఎందుకిక్కడ వున్నారు ? టీ కాగిందా ?' అన్నది.

ఆ యువతుల్లో ఒక యువతి, టీ కాగింది' అన్నది. తన పైటచెంగుతో కాగుతున్న 'టీ దించి జాగ్రత్తగా తీసుకుని వెళ్ళి టేబిల్ మీద పెట్టింది.

ఈలోగా వాసిలియాంద్రివిచ్ తను దోవ ఎలా తప్పిందీ, రెండు పర్యాయాలు మళ్ళీ అదే ఊరు ఎలా చేరుకున్నది, దోవతప్పి దార్లో తాగిన రైతులను ఎలా కలుసుకున్నదీ, ఈ వివరాలన్నీ చెబుతున్నాడు. అందరూ ఆశ్చర్యంతో వింటు న్నారు. వాళ్ళు దోవతప్పడం అందరికీ ఆశ్చర్యంగా కనుపిం చింది. ఎలా దోవ తప్పారో, ఎందుకు దోవ తప్పారో, వాళ్ళు దార్లో కలుసుకున్న తాగిన రైతులు ఎవరో తలా ఒక విధంగా చెబుతున్నారు.

'ఇక్కడినుంచి మోల్‌చనోన్ కు దోవ పసిపిల్లలైనా కనుక్కోగలరు. మీరెలా దోవ కనుక్కోలేకపోయారో ఆశ్చ ర్యకరంగా ఉంది. మీరు చెయ్యవలసిందల్లా హైరోడ్డుమీది నుంచి కుడివక్కకు తిరగడమే. అక్కడ మీకొక పొదకూడా కనుపిస్తుంది. మీరు ఆ పొదవరకుకూడా వెళ్ళినట్టులేదు' అన్నాడు పొరుగింటి అతిథి.

'మీరిక్కడ ఈరాత్రికి ఆగిపొండి. పక్కలు వేయిస్తాను,' అన్నది ముసలావిడ బలవంతంచేస్తూ.

'ప్రొద్దున్నే లేచివెళ్ళొచ్చు. ఉదయానవుతే ప్రయాణం కూడా హాయిగా సాగుతుంది' అన్నాడు ముసలిరైతు, తన భార్య మాట సమర్థిస్తూ.

'క్షమించాలి. ఈరాత్రికి ఉండలేను, చాలా అవసరమైన పనుంది,' అన్నాడు వాసిలియాండ్రివిచ్. 'ఒక్కగంట పోగొట్టుకుంటే సంవత్సరంవరకూ ఆ నష్టాన్ని పూరించుకోలేం'అన్నాడు. అతనికి తను కొనబోయే తోటవిషయం జ్ఞాపకంవచ్చింది. 'అక్కడికి చేరగలంకదూ' అన్నాడు నికిటా వంక చూచి.

'మళ్ళీ దోవ తప్పకుండాఉంటే తప్పకుండా చేరగలం' అన్నాడు నికిటా.

నికిటా కొంచెం దిగులుగా నిరాశగా ఉన్నాడు, దానికి కారణం అతనికి వోడ్కా తాగాలనిఉంది. కాని తన వాగ్దానం వల్ల తాగడానికి వీల్లేదు. పోనీ. కొంచెం టీ అయినా తాగితే ఆత్మారాముడు చల్లబడతాడు. ఆ టీకూడా ఇంకా ఇవ్వలేదు.

'మనం మలుపు చేరామంటే చాలు. ఇక దోవ తప్పం. అడవిలోగుండా రోడ్డుంది' అన్నాడు వాసిలియాండ్రివిచ్.

'సరే, మీ ఇష్టం వచ్చినట్టే కానీండి. వెళ్ళేట్టవుతే వెంటనే వెడదాం' అన్నాడు నికిటా తనకిచ్చిన టీ గ్లాసు ఖాళీ చేస్తూ.

'టీ తాగి వెడదాం' అన్నాడు వాసలియాండ్రివిచ్.

నికిటా ఏమీ సమాధానం చెప్పలేదు. తలఊపాడు. అంతే. సాసర్లో టీ పోసుకుని చేతులు వెచ్చచేసుకున్నాడు. కష్టించి పనిచేశేవాడు కావడంవల్ల అతని వేళ్ళు ఎప్పుడూ వాచిఉన్నట్టుగా ఉంటాయి. తరువాత తన ఆతిథే

యసులు వంకతిరిగి, 'మీ ఆరోగ్యం బాగుండుగాక' అని టీ పుచ్చు కున్నాడు.

'కొంచెం మలుపువరకూ మాతో ఎవరైనా వస్తే బాగుంటుంది' అన్నాడు వాసిలి యాండ్రివిచ్.

'ఆ ఏర్పాటు చేస్తాం. పెట్రూషా మీతో వస్తాడు.' అన్నాడు పెద్దకొడుకు.

'సరే, నీ బండికూడాకట్టు. మాకెంతో సహాయంచేసిన వాడవవుతావు' అన్నాడు వాసిలి యాండ్రివిచ్.

'తప్పకుండా గుర్రాణ్ణి మీతో పంపిస్తాం. నీవు ఇంతగా ఇదికావాలా? మాకెంతో సంతోషం,' అన్నది ముసలిరైతు భార్య.

'పెట్రూషా! వెళ్ళి గుర్రం సిద్ధంచెయ్యి' అన్నాడు పెద్దన్న.

'సరే' నని చిరునవ్వుతో పెట్రూషాగుర్రం సిద్ధంచేసి బండికట్టడానికి వెళ్ళాడు.

పెట్రూషా వెళ్ళగానే మళ్ళీ అందరూ మాట్లాడు కోటం మొదలెట్టారు. తన మూడోకొడుకు సెలవులకు తన కేమీ బహుమతి పంపించలేదనీ, తన భార్యకుమాత్రం ఫ్రెంచి శాలువా పంపాడనీ ముసలిరైతు పొరుగింటి అతిథితో చెబు తున్నాడు.

'కుర్రాళ్ళు ఈ రోజుల్లో మరీ చెయ్యిదాటిపోతు న్నారు' అన్నాడు.

'అన్నీ వాళ్ళకే తెలుసంటారు. వీళ్ళను అదుపులో పెట్టడం అసాధ్యంగాఉంది. మొన్న డిమోష్కిన్ తన తండ్రితో

పోట్లాడి చెయ్యి విరగ్గొట్టాడు. ఇదంతా తెలివితేటలనుకుం టారు,' అన్నాడు పొరుగింటి అతిథి.

నికిటా వాళ్ళముఖాలు పరిశీలిస్తూ ప్రశాంతంగా వింటూ కూచున్నాడు. తనూ వారి సంభాషణలో పాల్గొనేవాడే. కాని శ్రద్ధగా టీ తాగడంలో నిమగ్నుడై వుండి వారి మాటలకు అంగీకారసూచకంగా తల ఊపుతున్నాడు. వెచ్చదనంకోసం గ్లాసుతరువాత గ్లాసు టీ తాగుతున్నాడు. ఏకంగా ఉన్న కుటుంబం విభక్తమవుతే వచ్చే కష్టనష్టాలనుగురించి వారు మాట్లాడుకుంటున్నారు. వారు మాట్లాడుతున్నది వారికుటుంబ వ్యవహారమే. మౌనంగా కూచున్న రెండోకొడుకు కుటుంబం విభక్తం కావాలని కోరుతున్నాడు.

నిజంగా అది చాలా ముఖ్యమైన విషయం. చాలా రోజులనుంచి వారు ఈ విషయాన్నిగురించి ఆలోచిస్తున్నారు. కాని మర్యాదకోసం అపరిచితుల సముఖంలో వారి వ్యక్తిగత వ్యవహారాలను చర్చించలేదు. కాని ఎంత నిగ్రహించుకుందా మనుకున్నా ముసలాడు ఉండబట్టలేకపోయాడు, కుటుంబం కొమ్మ కొకరు అయిపోతారని ఊహించుకోగానే అతని కళ్ళ వెంట నీళ్ళుతిరగడం మొదలెట్టాయి. తన గొంతులో ఊపి రున్నంతకాలం అలాజరగటానికి వీలులేదు అనుకున్నాడు. "ఒకప్పుడు ఆ కుటుంబం ఎలా ఉండేది! ఇప్పుడెలా ఉంది! ఎందు కంటావ్? వేర్లు పడిపోబట్టేగా! అన్నాడు పొరుగింటి వ్యక్తి.

'మన సంసారం కూడా అలా కావాలను కుంటున్నా వన్నమాట; అన్నాడు ముసలాడు తన కొడుకువంక చూస్తూ.

కొడుకు ఈ మాటకు జవాబు చెప్పలా అంతా అదో విధంగా మాట్లాడకుండా మౌనంగా కూచున్నారు. ఈ నిశ్శబ్దానికి పెట్రూష్కా భంగం కలిగించాడు. అతను గుర్రంబండికట్టి ఇంట్లోకి వచ్చి నిల్చుని కాసేపటినుంచి వీరి చర్చలు వింటున్నాడు.

'దీన్నిగురించి మా ఊళ్లో ఒక చిన్నకథ ఉన్నది. ఒక తండ్రి కొడుకులకు ఒకచీపురుకట్ట నిచ్చి విరగదీయమన్నాడట. పుల్లలన్నీ కలిసి ఉన్నప్పుడు విరగ దీయలేక పోయారట. ఏ పుల్లకు ఆపుల్లవిడదీసి విరగ దీశారట' అని నవ్వుతూ; బండి సిద్ధంగా ఉంది ; అన్నాడు పెట్రూష్కా.

'సరే.ఇహ బయల్దేరుదాం' అంటూ వాసిలియాండ్రివిచ్ లేచాడు. ముసలాడివంక తిరిగి, 'నీవు కుటుంబం వేర్పడటానికి ఒప్పుకోకు తాతా. ఇప్పుడు కుటుంబమంతా కలిసి ఉంది కాబట్టి నీవు ఇంత పెద్దకుటుంబానికీ యజమానిగా ఉన్నావు' అన్నాడు. 'మావాణ్ణి ఏదో పిశాచం పట్టుకున్నట్టుగా ఉంది. వాడిమాట వాడిదే' అన్నాడు ముసలాడు.

నికిటా అయిదుగ్లాసులు టీ తాగడం ముగించాడు. ఆరో గ్లాసుకు అప్పుడే సిద్ధంగా ఉన్నాడు. పొయ్యిమీద కాగుతున్న టీనీళ్ళుఅయిపోయినాయి. అదీకాక వాసిలియాండ్రివిచ్ లేచి తన దుస్తులు వేసుకుంటున్నాడు. నికిటాకూడా తన యజమానితో పాటు తప్పనిసరిగా లేవవలసివచ్చింది.

ఓవర్‌కోట్ వేసుకుని, ఒక్కమాటు దీర్ఘంగా నిశ్వసించి తన ఆతిథేయులందరివద్దా సెలవుతీసుకుని బైటికి వెళ్ళాడు.

వెచ్చగా ఉన్న గదిలోనుంచి బైటికిరాగానే చలి దూసుకుని వచ్చింది. గాలి హోరని వీస్తోంది. మంచు వానగా కురుస్తోంది.

పెట్రూషాకా పెరట్లో గుర్రపుబండిదగ్గర నిల్చుని పాల్సన్స్ప్రైమర్ లోని పద్యం చదువుతున్నాడు.

నికిటా పద్యానికి అనుగుణంగా తల ఊపుతూ కళ్ళాలు బిగించాడు.

ఈలోగా వాసిలియాంద్రిడివిచ్ బైటికివచ్చాడు. వాసిలి యాంద్రిడివిచ్ కి దోవచూపుతూ ముసలాడు దీపంపట్టుకుని వచ్చాడు. బైటికి రాగానే గాలికి దీపం ఆరిపోయింది. మంచు తుఫాను మరింత పెద్దదయింది. 'అబ్బ! ఏం గాలి! మనం అక్కడికి చేరగలమా? అయినా తప్పేదేముంది? వ్యాపారం! బయలేరదాం. పైన దేవుడున్నాడు!' అనుకున్నాడు వాసిలి యాండ్రివిచ్.

ముసలాడుకూడా ఇంత గాలివానలో వెళ్ళొద్దన్నాడు. కాని వాసిలి యాండ్రివిచ్ వినిపించుకోలేదు.

'ఇహ వీళ్ళకు చెప్పి లాభంలేదు. నావృద్ధాప్యం వల్ల నాకు భయం ఎక్కువనుకుంటాను. సమయానికి అక్కడికి చేరు కోలేకపోరు', అనుకున్నాడు ముసలాడు.

పెట్రూషాక్కకు దారిభయం ఏమాత్రం లేదు. అతనికి ఆ చుట్టు పక్కల ఊళ్ళదారులన్నీ బాగా తెలుసు. నికిటాకు మాత్రం అంత రాత్రిలో బయలుదేరడం ఇష్టంలేదు. కాని ఏం చేస్తాడు? అతనికి మొదటినుంచీ ఒకరి మాటకు లొంగి ఉండడం అలవాటు. అంచాత కాదనలేక పోయాడు.

వాసిలియాంద్రివిచ్ చీకటిలో తడుముకుంటూ బండి దగ్గరికి చేరేసరికి చాలా కష్టమైంది. ఎలాగో కష్టంమీద బండి దగ్గరికి చేరి, బాడెక్కి సూచుని కళ్ళాలు చేతులోకి పుచ్చుకున్నాడు.

'నీబండి ముందుపోనీ పెట్రూష్కా,' అన్నాడు బిగ్గరగా.

పెట్రూష్కా గుర్రాన్ని అదిలించాడు. 'ముఖోర్తి' కొంచెం సేపటినుంచి సకిలిస్తోంది. తనముందు ఆడగుర్రాన్ని చూచి దవుడుఅందుకుంది. బాడ్లు రెండూ వీధిచేరాయి. మళ్ళీ వచ్చినదోవనే బాడ్లు రెండింటినీ పరుగెత్తించారు. అదే దోవ మళ్ళీ బైటఆరకట్టిన బట్టలు, గుడిసె, అవే దృశ్యాలు కనుపించాయి. ఇంకా మంచువాన విపరీతంగా కురుస్తోంది. మూలుగుతున్నట్టు గాలి వీస్తోంది. బాడ్లను అటూ ఇటూ ఛడీల్మని కొడుతోంది గాలి. పెట్రూష్కా తనబండిని త్వరగా పరుగెత్తిస్తున్నాడు. వెనకాలే వాసిలియాంద్రివిచ్ బండి వెడుతోంది.

పదినిమిషాల తరువాత పెట్రూష్కా వెనక్కు తిరిగి పెద్దగా ఏదో కేకపెట్టాడు. గాలి హోరనివీస్తూ ఉండడంవల్ల ఆ కేక వాసిలి యాంద్రవిచ్‌కి కాని నికీటాకు కాని వినిపించలేదు. కాని మలుపుదగ్గరికి వచ్చినట్టు మాత్రం వారు ఊహించారు. పెట్రూష్కా బాడిని కుడివైపుకు తిప్పాడు. ఇప్పుడు మంచు ముఖాలకు ఎదురువాటుగా కొడుతోంది. మంచుతెర ల్లోగుండా మలుపులో ఉన్న నల్లని పొద వారికి కనుపించింది.

'ఇక వెళ్ళండి. ఇదేదారి' అన్నాడు. పెట్రూష్కా.

'అభినందనాలు పెట్రూష్కా!'

'ఆకాశం గాలివాన దాచుకుంది' అన్నాడు పెట్రూష్కా అదృశ్యుడవుతూ.

'కవిలా ఉన్నారోయ్,' అనుకున్నాడు వాసిలి యాంద్రేవిచ్ తనలో తాను.

'మంచి రైతు బిడ్డ' అన్నాడు నికిటా ఇలా మాట్లాడు కుంటూ బండి సాగించారు.

నికిటా తనకోటు గట్టిగా కప్పుకుని, తల ముందుకువాల్చి కూచున్నాడు. అతనేమీ మాట్లాడడంలేదు. ముందు దారి గుర్తులు కనుపిస్తున్నాయి.

వాసిలియాంద్రేవిచ్ కూడా మెల్లగా బండి పోనిస్తున్నాడు. మధ్యమధ్యలో గుర్రం దోవ తప్పుతుంటే, 'ఇదీ దోవ, ఇకీ దోవ', అంటూ గుర్రాన్ని దోవలో పెడుతున్నాడు.

'త్వరగా అడవికి చేరాలి.' అనుకున్నాడు వాసిలి యాంద్రేవిచ్. వోడ్కా, టీ పుచ్చుకుని ఉండడంవల్ల ఉత్సాహంగా ఉన్నాడు. గుర్రం మంచిది. అంచాత వాసిలి యాంద్రేవిచ్ కళ్ళాలు ఇట్టే లాగడంతోటే మంచి కదనులో పోతోంది ఇలా పదినిమిషాలు ప్రయాణంచేశారు. కాని అడవి చేరువకు రాలేదు.

'మళ్ళీ దోవ తప్పినట్టున్నాం,? అన్నాడు వాసిలి యాంద్రేవిచ్ బండి ఆపుచేస్తూ.

నికిటా బండి దిగి మళ్ళీ మెల్లగా దోవకోసం వెదకడం మొదలెట్టాడు. ఒకటి రెండుసార్లవుతే పూర్తిగా చూపుకు అందకుండా పోయాడు.

చివరకు తిరిగివచ్చి వాసిలియాంద్రివిచ్ స్థానంలో తను కూచుని కళ్ళాలు పుచ్చుకున్నాడు. 'మనం కుడివైపుకు వెళ్ళాలి' అని బండిని కుడివైపుకు తిప్పాడు.

'అదే దోవవుతే కుడివైపుకే పోనీ,' అన్నాడు వాసిలియాంద్రివిచ్ నిర్లిప్తంగా.

నికిటా జవాబు చెప్పలా.

'అబ్బాయ్! దవుడు తియ్యాలి,' అన్నాడు గుర్రాన్ని అదిలిస్తూ. కాని గుర్రం మెల్లగా నడక వేగంతోనే పోతోంది.

కొన్ని ప్రదేశాలలో మంచు గుర్రం ముందుగాళ్ళ వరకూ వస్తోంది. బండి సరిగా సాగడంలేదు.

బండి ముందు వేలాడతీసి ఉన్న చర్నకోల తీసుకుని గుర్రాన్ని ఒక్క దెబ్బ తీశాడు. గుర్రానికి ఎప్పుడూ చర్నకోల దెబ్బలు అలవాటులేదు. అంచాత చర్నకోల దెబ్బ తగలగానే ముందుకు ఒక్క దుముకు దుమికింది. కాని మళ్ళీ యథాతథం గానే నడక సాగించింది! ఇలా అయిదు నిమిషాలు ప్రయాణం చేశారు. చీకటి బాగా దట్టంగా ఉంది. కిందా, పైనా, మంచు సుడిగాలిలా తిరుగుతోంది. మంచుకు బండి ఇరుసుకూడా ఒకోక్కమాటు కనుపించడంలేదు. ఒకోక్కసారి బండి వెనక్కు పోతున్నదా అనిపిస్తోంది. గుర్రం హఠాత్తుగా ఆగిపోయింది. ఏదో అడ్డుకున్నట్టుంది. నికిటా మళ్ళీ బండ్లోనుంచి కిందికి దూకాడు. ఒక్క అడుగు వేశాడో లేదో దొర్లుతూ కిందికి వెళ్ళిపోయాడు.

'ఓ. ఓ. ఓ.' అంటూ దొర్లాడు. అడుగు తాకేవరకూ మంచులో పూడిపోయాడు.

'నికిటా! నికిటా! ఓ నికిటా!' — పిలుస్తున్నాడు వాసిలి యాండ్రివిచ్ పైనుంచి.

కాని నికిటా దగ్గరనుంచిజవాబు రాలేదు మంచు దులుపుకోడంలో నిమగ్నుడై ఉన్నాడు. చర్నకోల ఎక్కడో పడిపోయింది. దానికోసం వెదుకుతున్నాడు. చర్నకోల దొరకగానే మళ్ళీ పైకి ఎక్కదలచుకున్నాడు. కాని లాభంలేక పోయింది. మళ్ళీ కిందికి జారాడు. ఎలాగైతేనేం ఏడుగజాల దూరంలో ప్రాకుకుంటూ పైకి తేలాడు. అతనికి మంచు మసకలో బండి కాని గుర్రంకాని కనుపించడంలేదు, వాసిలి యాండ్రివిచ్ కేకలు, గుర్రం సకిలింపులు మాత్రం వినిపిస్తున్నాయి.

'వస్తున్నానయ్యా' అని మారుపలికాడు నికిటా.

బండిదగ్గరికి చేరేవరకూ అతను బండినీ, వాసిలియాండ్రివిచ్‌నీ గుర్తించలేకపోయాడు.

'ఎక్కడికి వెళ్ళావురా? దోవ కనుపించిందా?' అన్నాడు వాసిలియాండ్రివిచ్.

'వెనక్కు వెళ్ళాల్సి వచ్చేట్టుందయ్యా. కాని ఎలా వెళ్ళాలో దోవ తెలియడంలేదు. మంచు పెద్ద మడుగల్లే ఉంది. నేను పూడుకుపోయి బైటికి వచ్చేసరికి నా తాతలు దిగొచ్చారు' అన్నాడు నికిటా.

'ఇప్పుడేం చెయ్యాలి? ఇక్కడ ఎలాఉంటాం? ఎటో ఒకవైపు వెళ్ళాలి' అన్నాడు వాసిలియాండ్రివిచ్.

నికిటా ఏమీ జవాబు చెప్పలేదు. బండ్లో కూచుని మంచు దులుపుకున్నాడు.

భారమంతా నికిటామీద వదిలిపెట్టినట్టుగా వాసిలి యాంద్రవిచ్ కూడా ప్రశాంతంగా ఊరుకున్నాడు. మళ్ళీ బండి కదిలింది. ఒక వందగజాలు వెళ్ళిందో లేదో గుర్రం హఠాత్తుగా ఆగింది. ముందు లోయ కనపిస్తోంది.

నికిటాబండి దిగి మళ్ళీ మంచులో వెదకడం మొదలెట్టాడు. కాసేపు అటూ ఇటూ దోవకోసం వెదికి 'వాసిలి యాంద్రివిచ్! బ్రతికిఉన్నావా?' అని కేకేశాడు.

'ఇక్కడే ఉన్నాను. దోవ కనుపించిందా?' అని మారు పలికాడు వాసిలియాంద్రివిచ్.

'అంతా అయోమయంగా ఉంది. చీకటి దట్టంగా ఉంది. నేలంతా బ్రద్దలుగా పగుళ్ళుబాసింది. దోవ కనుపించడంలేదు,' అన్నాడు నికిటా.

మళ్ళీ నికిటా దోవకోసం వెదకడం మొదలెట్టాడు. వెదికి వెదికి అలసిపోయి బండిప్రక్కన కూలబడ్డాడు.

'ఏం చేద్దాం?' అన్నాడు వాసిలి యాంద్రివిచ్.

'నా ప్రాణం పూర్తిగా అలసిపోయింది. గుర్రంకూడా ఇహ కదలదు', అన్నాడు నికిటా.

'అయితే ఏం చెయ్యాలి?'

'ఒక్క నిమిషం ఆగండి.'

'నికిటా ఒక్కమాటు వెళ్ళి మళ్ళీ తిరిగి వచ్చాడు.'

'నా వెంటరండి,' అన్నాడు గుర్రం ముందుగా వెళుతూ.

వాసిలి యాంద్రివిచ్ మారుమాట్లాడకుండా నికిటా వెంట వెళ్ళడం మొదలెట్టాడు,

నికిటా ముందు దోవతీస్తున్నాడు.

కొన్ని అడుగులు నడిచిన తరువాత గుర్రం మంచులో పూడుకుని పోయింది.

'లే అబ్బాయ్ లాభంలేదు', అని కేకేశాడు నికిటా.

కాని గుర్రం లేవలేదు. ఏదో ఆలోచిస్తున్న వాడిలా అలాగే కూచునిపోయింది.

'లాభంలేదులే'. అన్నాడు నికిటా. గుర్రం తలెత్తి ఒక్క దూకుదూకింది.

'అదీ!' అన్నాడు నికిటా.

ఒక్క పరుగులో మంచుమడుగుదాటి ఎగరొప్పుతూ నిల్చిపోయింది. వాసిలియాంద్రవిచ్ కూడా అలసటతో రొప్పుతూ బండిలో కూలిపోయాడు.

'మీరలాగే బండ్లో పడుకోండి. నేను బండి నడిపించుకుని పోతాను.' అన్నాడు నికిటా.

మంచువాన తీవ్రంగా వీస్తోంది. ఒక్కసారి ఎడా పెడా కొట్టింది. ఇహ చేసేదిలేక బండి ఆగిపోవలసివచ్చింది. నికిటా గుర్రం తాళ్ళు విప్పడం మొదలెట్టాడు.

'ఏం చేస్తున్నావు!' అన్నాడు వాసిలియాండ్రివిచ్.

'గుర్రపు తాళ్ళు విప్పుతున్నా.'

'ఇక వెళ్ళలేమా?'

'ఇహ వెడితే గుర్రం చచ్చిపోతుంది. ఇప్పటికే కొన ఊపిరితో ఉంది' అన్నాడు నికిటా. గుర్రం ఎగరొప్పుతో దీనంగా నిల్చుని ఉంది.

'ఇక్కడ గడ్డకట్టుకుని పోతాం' అన్నాడు వాసిలియాండ్రివిచ్.

'ఇక చేసేదిలేదు?' అన్నాడు నికిటా.

# 6

వాసిలియాం(డివిచ్ రెండు ఉన్నికోట్లు వేసుకున్నాడు. అయినా చలి అతని వెన్నులోగుండా దూసుకపోతోంది. నూదుల్లా పొడుస్తున్న ఈ రాత్రంతా ఎలా గడపడమూ అను కున్నాడు వాసిలియాం(డివిచ్. ఎలాగో ఒకలా మనస్సు కుదట పరుచుకుందామని బండ్లో కూచుని సిగరెట్ పెట్టె అగ్గిపెట్టె బైటికి తీశాడు.

గుర్రంకూడా చలికి గజగజలాడిపోతోంది. ముందు నికిటా వేసిన గడ్డికూడా నోటకరుచుకోలేక మంచు గాలికి గడ్డకట్టుకునిపోతూంది.

'ఇహ ఇక్కడ ఒకగుర్తు వేదాం' అన్నాడు నికిటా. బండి ముందు భాగాన్ని మంచుగాలికి ఎదురుగా తిప్పి రెండుబద్దలు కొట్టాడు.

'మంచు మనల్ని పూర్తిగా కప్పేస్తే ఎవరైనా చూచి మనల్ని బైటికి తీస్తారు' అన్నాడు.

వాసిలి యాండి(డివిచ్ బండ్లోకూచుని అగ్గిపుల్లలు పుల్లమీద పుల్ల గీచాడు. ఒకపుల్లకూడా వెలగలేదు. అతని (వేళ్ళు వణికిపోతున్నాయి. ఎలాగైతేనేం చివరకు ఒక్కపుల్ల వెలిగింది. వాసిలి యాం(డివిచ్ సిగరెట్ వెలిగించి రెండుగు క్కలు ఆతురంగా లోపలికి పీల్చాడు.

ఆ రెండుమూడు గుక్కలే అతనికెంతో సంతృప్తి నిచ్చాయి.

'ఉండదలచుకుంటే ఈ రాత్రంతా ఇక్కడ ఉండిపోవల సిందే,' అన్నాడు నిశ్చయంతో. 'ఉండు, గుర్తుకోసం ఒక జండా కూడా ఉంచుదాం,' అన్నాడు, తన మెడచుట్టూ ఉన్న రుమాలుతీసి బండిముందు కట్టాడు.

రుమాలు వెంటనే మంచుకూ గాలికీ విపరీతంగా కొట్టు కోడం మొదలెట్టింది.

'చూడు మనజండా ఎంతచక్కగా ఉందో,' అన్నాడు వాసిలియాంద్రిచ్, తన నేర్పరితనానికి తనే పొంగిపోతూ.

'మనిద్దరం బండ్లో ఉంటే వెచ్చగా ఉంటుంది. కాని బండ్లో చోటులేదే', అన్నాడు.

'నే నెక్కడైనా స్థలం చూచుకుంటాను. ముందు గుర్రాన్ని ఎలాగైనా కప్పి ఉంచాలి. పాపం, చెమటలు కక్కుతోంది?' అన్నాడు నికిటా. బండ్లో పరిచిన ఒక ఉన్ని శాలువా తీసి గుర్రానికి కప్పాడు. తను బండ్లోనుంచి ఒక బూర్నీసూ, కొద్దిగా గడ్డి తీసుకున్నాడు.

బండి వెనకాలకు వెళ్ళి మంచులో ఒక చిన్న గుంట తీసి అందులో గడ్డి పరిచి బూర్నీసు కప్పుకుని, చలిటోపీ ముందుకు లాక్కుని గుంటలో కూచున్నాడు.

వాసిలియాంద్రిచ్ ఇదంతా వెక్కిరింతగా చూస్తూ కూచున్నాడు.

అతనికి నిద్రపట్టడంలేదు. ఆలోచిస్తూ కూచున్నాడు. అతనికి ఎప్పుడూ జీవితంలో ఒక్కటే ఆలోచన — డబ్బుని గురించి. తను ఇంతవరకు ఎంత డబ్బు సంపాదించాడు? ఇహ ముందు ఎంత సంపాదించబోతున్నాడు? —

ఇదొక్కటే ఆలోచన. ఇదొక్కటే అతను జీవితంలో గర్వించదగిన విశేషం. తన సంపాదన విషయమేమీ లేదు – ఇతరులు ఎంత సంపాదించారు, ఎలా సంపాదించారు, ఎంత సంపాదించ బోతున్నారు. ఇదీ ఆలోచిస్తాడు వాసిలియాంద్రేవిచ్. వాళ్ళందరినీ ఎలా మించిపోవాలా అని ఎప్పుడూ ఎత్తుగడలు వేస్తూంటాడు. గోష్కిన్ తోట దొడ్డి కొనడం అతనిదృష్టిలో ఎంతో ప్రధానమైనవిషయం. ఈ బేరంలో పదివేల రూబుళ్ళు లాభం సంపాదించాలనుకున్నాడు. ఆ దొడ్డి విలువనూ, దొడ్లో చెట్ల విలువనూ లెక్క వేసుకోడం మొదలెట్టాడు. లెక్కంతా వేసుకున్నాక, మూడువేల రూబుళ్ళిస్తే తోట ఇచ్చేస్తాడన్నట్టు తేల్చాడు.

'అబ్బ! ఇదేమిటాని భగవంతుడా! దోవ తప్పాం. ఆ మలుపులో తోట ఉండాల్సింది. కాపలాదారు గుడిసె కనుపించేది. కుక్కల అరుపులు వినిపించేవి. కాని అవి సమయానికి అరిస్తేగా!' అనుకున్నాడు. కుక్కల అరుపు వినిపిస్తుందేమోనని చెవులు నిక్కించుకుని వినసాగాడు. కాని గాలి మోత తప్ప మరేమీ వినరావడంలేదు. మళ్ళీ చెవులకు గుడ్డ కప్పుకున్నాడు.

'ఇలా జరుగుతుందని తెలిస్తే రాత్రి అక్కడ ఉండిపోయేవాణ్ణే. కానీ, ఏం చేస్తాం! రేపటికి చేరుకుంటాం. ఒక రోజు పోయిందనుకుంటాను. ఈ తుఫానులో ఇతర బేరగాళ్ళు మాత్రం ఎలావస్తారు?' అనుకున్నాడు వాసిలియాంద్రివిచ్. తరువాత అతనికి ఇంటివిషయాలు, ఎన్నో గొడవలు జ్ఞాపకం వచ్చాయి.

'తొమ్మిదో తారీకు కటికవాడు వస్తాడు – నా దున్నపోతుల డబ్బిస్తాడు. నా భార్యకు లెక్కచూచుకుని డబ్బు తీసుకోడం తెలుసో, తెలీదో!' అనుకున్నాడు. 'ఎందులోకూడా ఒక అతిథిని ఎలా మర్యాదచెయ్యాలో దానికి తెలీలేదు,' అనుకున్నాడు.

'ఆడది! దానికేం తెలుస్తుంది? అదేమన్నా ప్రపంచం చూచిందా పెట్టిందా? మాతండ్రిగారి కాలంలో మా ఇల్లు ఎలాఉండేది? ఒక రైతుఇల్లు! అంతే! మాకున్న ఆస్తిమాత్రం ఎంత? ఒక ఓట్ మిల్లు, ఒక సత్రువు – అంతే కాని పదిహేను సంవత్సరాలలో మా ఆస్తి నేనెంతో పెంచాను. ఒక దుకాణం రెండు సారాకొట్లు, ఒక పిండిమర, ఒక ధాన్యందుకాణం, రెండు దొడ్లు, ఒక మేడ – ఇదంతా నా సంపాదనే! ఇప్పుడు నా జిల్లాలో నాఅంతపేరు గడించుకున్న వ్యక్తిలేదు. కారణం? నా పని నేను పొల్లుపోకుండా చూచుకుంటాను. కులాసా కాలక్షేపాలతో ప్రొద్దుపుచ్చే సోమరుల్లాగా కాక, ముందు పనివిషయంలో శ్రద్ధతీసుకుంటాను. డబ్బు గడించడమంటే సామాన్యంగా ఉందా? ఒక్క పైసా గడించాలంటే ప్రాణాలు పోతాయి. తల బద్దలుచేసుకోవాలి. రాత్రిలేదు, పగలూలేదు'– ఇలా ఆలోచించసాగాడు వాసిలియాండ్రివిచ్.

చేతిలో చిల్లిగవ్వలేకుండా జీవితాన్ని ప్రారంభించి లక్షాధికారు లయిన అదృష్టవంతు లందరూ అతనికి జ్ఞాపకం వచ్చారు. 'మన శక్తిలోపంలేకుండా మనం శ్రమిస్తే ఈశ్వరుడు అనుగ్రహిస్తాడు.' అనుకున్నాడు.

వాసిలి యాం(డివిచ్ ఇలా ఆలోచిస్తున్నాడు. మంచు తుఫాన మాత్రం తీవ్రంగా కురుస్తోంది.

"అబ్బ ఏం మంచు! తెల్లారితే మంచులో పూడుకుని పోయి లేవగలుగుతామో లేదో!" అనుకున్నాడు. మంచు చీకటిలో సుడిగుండంలా తిరుగుతోంది. ఆ మంచులోనుంచి ఒక్క గుర్రం తలమాత్రం మసకగా కనుపిస్తోంది. చుట్టూ మాత్రం తెల్లని మంచు రాత్రిని కప్పేస్తోంది.

"నికిటామాట చెవినపెట్టడం పొరపాటయింది. బండి ఆపకుండా ప్రయాణం సాగించాల్సింది. ఎక్కడో ఒక చోట చేరేవాళ్ళం. ఈ రాత్రంతా ఎలా గడపడం? అబ్బ! ఎలా గడపడం?" అని ఆరాటపడసాగాడు వాసిలియాం(డివిచ్.

వెల్లకిలా పడుకుని సిగరెట్ పెట్టెతీసి అగ్గిపుల్లలు గీయడం మొదలెట్టాడు. ఒక్క పుల్ల కూడా వెలగలేదు. చివరకు ఎలాగైతేనేం ఒక్కపుల్ల వెలిగించి సిగరెట్ అంటించాడు. రెండుమూడు గుక్కలు సిగరెట్ పొగ పీల్చగానే అతనికి కాస్త సంతృప్తి కలిగింది. మళ్ళీ వెనక్కి ఒరిగి ఏవేవో ఆలోచనలలో పడ్డాడు. అలా ఆలోచిస్తూండగానే అతనికో కునుకు పట్టింది.

హఠాత్తుగా అతన్ని ఎవరో తోసినట్లనిపించి. ఉలికిపడి లేచాడు. అతని గుండె వేగంగా కొట్టుకోడం మొదలెట్టింది. అతను పడుకున్న బండియావత్తూ వణుకుతున్నట్టు తోచింది. కళ్ళు తెరిచి చూచాడు. చుట్టూ ఏమీ మార్పులేదు. అంతా యథా తథంగానే ఉంది. రాత్రి విచ్చుతున్నట్టుంది. తెల్లవార డానికి ఇహ ఎంతోకాలం లేదనుకుంటాను, అనుకున్నాడు. వాసిలియాం(డవిచ్ కూచుని బండ్లోనుంచి వెనక్కి తిరిగి

చూచాడు. నికిటా పూర్వం కూచున్న స్థానంలోనే కూచుని ఉన్నాడు. అతడు కప్పుకున్న పట్టా అతని కాళ్ళూ పూర్తిగా మంచుతో కప్పబడి ఉన్నాయి.

"ఏడు మంచులో పూడుకుని చనిపోలేదుకదా! కొంపు తీసి అంతా నన్ను ఆడిపోస్తారు. వీణ్ణి నాతో తీసుకుని రావడం పొరబాటయిపోయింది, అంతా దాని మొండితనం! 'వాణ్ణి కూడా తీసుకెళ్ళండి,' అని ఒకటే గొడవపెట్టింది." అనుకుంటూ తనకు ఏమాత్రం ప్రేమలేని తన భార్యను ఆడిపోసుకున్నాడు వాసిలియాండ్రివిచ్. 'ఒకమాటు నా పినతండ్రి ఇలాంటి రాత్రే గడిపాడు. కాని ఏమీ ప్రమాదం కలగలేదు. కాని మరోసారి మరొకడు ఇలాగే రాత్రంతా మంచులో గడిపి మంచులో పూడుకుని పోయాడు. తెల్లవారి చూచేసరికి చనిపోయి ఉన్నాడు' అనుకున్నాడు వాసిలియాండ్రవిచ్. ఈ సంఘటన జ్ఞాపకం వచ్చేసరికి అతనికి కొంతభయం కలిగింది.

గ్రిష్కినోలో రాత్రి ఆగిపోయి ఉంటే ఈ బాధ ఉండేది కాదుగదా అనుకున్నాడు.

శరీరం వెచ్చగా ఉండాలని ఉన్నికోటు గట్టిగా కప్పు కున్నాడు. కళ్ళు మూసుకుని నిద్ర పోదామని ప్రయత్నించాడు. కాని ఎంత ప్రయత్నించినా కళ్ళు మూతలు పడడంలేదు. మళ్ళీ తన లాభ నష్టాలనుగురించి లెక్కలు వేసుకోడం మొదలెట్టాడు. కాని అతన్ని లోలోపల ఏదో అవ్యక్తమైన భయం కలవరపెట్ట సాగింది.

'గ్రిష్కినోలో ఉంటే ఎంత బావుండేది! వెచ్చనిగదిలో పడుకుని ఎంత హాయిగా నిద్రపోయేవాణ్ణి?' అనుకున్నాడు.

అటూ ఇటూ నిద్ర రాక పొర్లడం మొదలెట్టాడు. ప్రశాంతంగా కళ్ళు మూసుకుని నిద్రించాలనుకుంటాడు. కాని ఏవో ఆలోచనలు వచ్చి అతని కళ్ళు మూతలు పడనీయలేదు.

ఎక్కడో దూరంగా కోడి కూత వినిపించినట్టు అనిపించింది. అతను లేచి కూచుని కోటు సర్దుకుని శ్రద్ధగా విన్నాడు. కాని ఎంత శ్రద్ధగా చెవులు నిక్కించుకుని విన్నా గాలి చప్పుడు తప్ప మరేమీ వినిపించలేదు.

నికిటా అలాగే కూచుని ఉన్నాడు. వాసిలియాండ్రివిచ్ రెండు మూడుసార్లు పిలిచాడు. కాని జవాబు చెప్పలా. 'చూడు, వెధవ - మంచులో ఎలా నిద్రపోతున్నాడో,' అనుకున్నాడు వాసిలియాండ్రివిచ్ విసుగ్గా.

వాసిలియాండ్రివిచ్ కి నిద్రపట్టడంలేదు. ఇరవై ముప్ఫయి సార్లు లేచికూచున్నాడు. ఈ రాత్రి ఇహ తెల్లవారదేమో అనిపించింది.

'తెల్లవారవస్తోంది,' అనుకుని లేచి కూచుని చుట్టూ కలయచూడడం మొదలెట్టాడు. గడియారం చూచుకుందామనుకున్నాడు.

కాని వాసిలియాండ్రివిచ్ కి అంతరాంతరాలలో ఇంకా ఉదయం దగ్గరికిరాలేదని తెలుసు. అతనికి లోలోపల భయం మరీ హెచ్చుతోంది. ఉన్నికోటుతీసి ఎలాగో ఒకలా వెస్టుకోటులో గడియారంకోసం వెదికాడు. చీకట్లో గడియారం కనుపించడంలేదు. ఎంతో కష్టంమీద అగ్గిపుల్ల వెలిగించాడు. పన్నెండుదాటి పదినిమిషాలే కావస్తోంది, ఇంకా రాత్రి ఎంతో భాగం ఎదురుచూస్తూనే ఉంది.

'ఈ రాత్రికి అంతూ పొంతూ లేనట్టుంది. అసలు తెల్లవారదేమో!' అనుకున్నాడు విసుగ్గా. అతని నరాల్లో భయం బాకుపోటులా దూసుకుని పోయింది. ఇహ చేసేదిలేక బండ్లో ఒకమూలగా నక్కి కూచున్నాడు. హఠాత్తుగా అతనికి మరో శబ్దం వినిపించింది. ఆ శబ్దం గాలిహోరుమాత్రం కాదు. ఆ శబ్దం ముందు నెమ్మదిగా బయలుదేరి రాను రాను క్రమ క్రమంగా పెద్దదైంది. అది తోడేలు అరుపు. సందేహం ఎంత మాత్రం లేదు. వాసిలియాండ్రివిచ్ ఉన్నికోటు కాలర్ చెవులనుంచి దించుకుని ఆ శబ్దాన్ని శ్రద్ధగా విన్నాడు. గుర్రం కూడా చెవులాడిస్తూ ఆ శబ్దం విన్నది. తోడేలు అరవడం మానగానే హెచ్చరిస్తున్నట్టుగా సకిలించింది. తరువాత వాసిలియాండ్రివిచ్‌కి నిద్రపట్టలేదు. అశాంతి ఎక్కువైంది. అతను తన లాభనష్టాలనుగురించి, తన వ్యాపారం, కీర్తిప్రతిష్ఠలు - ఈ విషయాలన్నిటిని ఆలోచించినకొద్దీ అతను భయానికి మరింత వశుడైపోయాడు. అతని శరీరమంతా నరనరమూ వణికిపోతోంది. భయంవల్లనో చలివల్లనో అతనికి అర్థంకాలేదు. మళ్లీ పడుకుని నిద్రపోవాలని యత్నించాడు. కాని ఎంతకూ నిద్రపట్టలా. ఒకపద్ధతిలో కూచుందామనుకున్నాడు. కాని లాభం లేదు. లోపల అశాంతి భ య ం తు ఫా ను లా రేగుతోంది. మళ్ళీ అగ్గిపెట్టె సిగరెట్లు తీశాడు. అగ్గిపెట్టె దమ్ముకుని పోయింది. ఒక్క పుల్లకూడా వెలగలా.

'పాడుసిగరెట్. చావు!' అని తిట్టిపోశాడు సిగరెట్‌ని తన కోపం ఎవరిమీదనో తనకే తెలీలేదు. విసుగుతో అగ్గిపెట్టె విసిరి పారెయ్యబోయాడు. కాని గ్రహించుకుని మళ్ళీ జేబులో

పెట్టుకున్నాడు. తను నిభాయించుకోలేని ఒక తీవ్రమైన అశాంతి అతన్ని ఆవరించింది. ఒకచోట నిలవలేకపోయాడు. బండ్లోనుంచి దిగి బయల్లో నిల్చున్నాడు. గాలి హోరని వీస్తోంది. 'ఇలా మృత్యువుకోసం నిరీక్షిస్తూ కూచుని లాభమేమిటి? గుర్రం ఎక్కి వెళ్ళిపోదాం,' అనుకున్నాడు. ఈ భావం అతనికి హఠాత్తుగా స్ఫురించింది. వెంటనే నికిటా విషయం జ్ఞాపకం వచ్చింది.

'వాడిదేముంది? వాడు ఉన్నా ఒకటే, పోయినా ఒకటే' అనుకున్నాడు. 'వాడి జీవితానికి విలువలేదు. నాకు జీవితంలో సాధించాల్సిన విషయాలు చాలా ఉన్నాయి,' అనుకున్నాడు.

వాసిలియాండ్రివిచ్ గుర్రంవిప్పి కళ్ళాలు బిగించి గుర్రం ఎక్కబోయాడు. కాని బూట్లు జారి ఎక్కలేకపోయాడు మళ్ళీ బండ్లోనుంచి ఎక్కదామని ప్రయత్నించాడు. కాని బండి ఊగులాడుతూ ఉండడంవల్ల అలాకూడా ఎక్కలేక పోయాడు. చిట్టచివరకు గుర్రాన్ని బండి దగ్గరకు లాగి గుర్రం వీపుపై ముందు బోర్లగిలా పడుకుని ఎక్కి కూచున్నాడు. బండి చప్పుడుకు నికిటా లేచి కూచున్నాడు.

'నీమాటవింటే ఇలా దిక్కులేనిచావు చావల్సిందే,' అని గుర్రాన్ని అదిలించి తన తోట, తోట కావలాదారు గుడిసె ఉంటుందని ఊహించిన దిక్కువైపుకు గుర్రం తోలుకుని వెళ్ళాడు.

## 7

పట్టా కప్పుకుని బండి వెనకాల కూచున్నప్పటినుంచీ నికిటా కదల్లేదు. తపస్సు చేస్తున్నవాడిలా అలాగే కూచు

న్నాడు. ప్రకృతితో సంబంధం ఉన్నా లేనివాళ్ళందరిలాగానే నికిటాకు ఓర్పెక్కువ. ఎన్ని గంటలైనా ఎన్ని రోజులైనా మారుమాటాడకుండా వేచి ఉండడం అతనికి అలవాటే. తన యజమాని పిలుపు అతను విన్నాడు, కాని అతనికి జవాబు చెప్పాలనిపించలేదు. అలసిపోయిన గుర్రంలా అలాగే పడి ఉన్నాడు. అతని కాళ్ళూ చేతులూ కొంకర్లు పోయాయి. కుడి కాలి బొటనవ్రేలవుతే పూర్తిగా బండబారిపోయింది. ఇంతే కాకుండా అతని శరీరమంతా మంచుకు గడ్డ కట్టుకుని పోతోంది.

అతను బహుశా ఆరాత్రి చనిపోవచ్చుననే ఊహా అతనికి కలగకపోలేదు, కాని ఆ ఊహా అతనికి అంత భయంకరంగా కనుపించలేదు. మృత్యువు ఆసన్నమవుతున్నదంటే అతనికి ప్రత్యేకమైన భయమేమీ కలుగలేదు. దానికి కారణం అతని జీవితమే అలాంటిది. అతని జీవితంలో పండగరోజునకూడా విశ్రాంతి తీసుకున్నదిలేదు. ఎప్పుడూ గానుగ ఎద్దులా తిరిగిన జీవితం అతనిది. అదీకాక మృత్యువు అతనికి భయంకరంగా కనుపించకపోవడానికి మరో కారణంఉంది. ఈ లోకంలో తను సేవించిన వాసిలియాంద్రివిచ్ లాంటి యజమానులేకాక యజమానులందరిలోకి పెద్దయజమాని ఒకడున్నాడని అతనికి తెలుసు. తను ఆ యజమానిపైనే ఆధారపడి ఉన్నాడని, ఆ యజమానే తనకు ఈ శరీరం కల్పించాడనీ, ఈ శరీరం రాలిపోయే సమయంలోకూడా తను ఆ యజమాని ఆధీనంలోనే ఉంటాడని, లోకంలో ఎవరు ఎలాటి అన్యాయాలుచేసినా, ఆ యజమాని మాత్రం అన్యాయం చెయ్యడని నికిటాకు తెలుసు.

నికిటాకు అప్పుడు తన పాపాలు జ్ఞాపకం వచ్చాయి. తాగుడు, తాగుడుకోసం తను తగలేశిన డబ్బు, తనభార్యతో పోట్లాటలు, చర్చికి వెళ్ళకపోవడం, పాపనివేదన సమయంలో మతగురువు పెట్టిన చివాట్లు అన్నీ జ్ఞాపకం వచ్చాయి.

'అవును. పాపాలు చేశాను. చేసిన మాట నిజమే. కాని ఈశ్వరుడు నన్నలా చేశాడు ఏంచేస్తాం?' అనుకున్నాడు.

మొట్టమొదట ఆ రాత్రి అతనికి ఏం జరగబోతుందోనని ఆలోచించాడు. కాని వెంటనే అలాంటి ఆలోచనలు మానేశాడు. తన మనస్సులో ఏ ఆలోచనలు లేకెత్తితే అవే ఆలోచించడం మొదలెట్టాడు. మార్తా రాక పనివాళ్ళలో తాగుడు అలవాటు, తను తాగుడు వదిలెయ్యడం, ఈ ప్రయాణం, తన కొడుకు, తన యజమాని గుర్రం ఎక్కుతోంటే బండి ఊగిసలాడడం, - ఇలా ఎన్నెన్నో ఆలోచనలు అతని మనస్సులో నీడల్లా ఆడడం మొదలెట్టాయి. ఈ ఆలోచనల నీడలన్నీ ఆడి ఆడి ఒక దానిలో ఒకటి కలిసిపోయాయి. నికిటా అలాగే నిద్రపోయాడు.

వాసిలియాంద్రివిచ్ గుర్రంఎక్కి పరుగుతీసినప్పుడు ఆ మొదటిపరుగులో గుర్రానికి బండితగిలి ఊగులాడింది. గుర్రం ఊపుకు నికిటా లేచి కూచున్నాడు. అతను హఠాత్తుగా లేవగానే భీకరమైన చలి అతన్ని ఆపాదమస్తకం ముంచెత్తింది. వాసిలియాంద్రివిచ్ గుర్రంమీాద వెళ్ళిపోవడం చూచి గుర్రం తప్పుకున్న పట్టామాత్రం వదిలిపొమ్మన్నాడు నికిటా.

కాని వాసిలియాంద్రివిచ్ గుర్రం కదిలిపోయింది. మంచు పొగల్లో అదృశ్యమై పోయింది.

నికటూ ఒంటిగా మిగిలిపోయాడు. ఒక్కనిమిషం ఏం చెయ్యాలో ఆలోచించాడు. చుట్టూ ఎక్కడైనా కొంపడుం దేమో వెదుకదామంటే అతనిఒంట్లో శక్తి లేదు. తను పూర్వం కూచున్న గుంట పూర్తిగా మంచుతో నిండిపోయింది. 'అయ్యో భగవంతుడా!' అనుకున్నాడు. భగవంతుడు జ్ఞాపకం రాగానే తను ఒంటిగా లేడనీ తనకు తోడు మరొకడున్నాడనీ అతనికి సంతృప్తి కలిగింది. ఒక్కసారి దీర్ఘంగా విశ్వసించి బండ్లో ఎక్కి తనయజమాని పడుకున్నచోట పడుకున్నాడు.

కాని బండ్లోకూడా అతనికివెచ్చాగా లేదు. చలి నరాలు కోసేస్తోంది. క్రిమక్రిమంగా వణుకు తగ్గింది. క్రమక్రమంగా అతను చైతన్యం కోల్పోవడం మొదలెట్టాడు. అతన్ని నిద్ర ఆవరిస్తోందో మృత్యువు ఆవరిస్తోందో అతనికే తెలీదు. కాని అతను రెండింటికీ సిద్ధపడ్డాడు.

## 8

తనుకోనబోయే తోట ఉంటుందని ఊహించిన దిక్కువైపుకు వాసిలియాంద్రివిచ్ గుర్రాన్ని పరుగెత్తిస్తున్నాడు. అతని కళ్ళనిండా మంచు కప్పేసింది. ఎదురుగాలి వీస్తోంది. గుర్రం ఎంతో కష్టంమీద పరుగెత్తుతున్నది. అతను గుర్రాన్ని విపరీతంగా అదిలిస్తున్నాడు.

ఇలా అయిదు నిమిషాలు ప్రయాణం చేశాడు. ఎదురుగా తెల్లని మంచుముసుగు తప్ప మరేమీ కనుపించడంలేదు. గాలి హోరని వినిపిస్తోంది.

హఠాత్తుగా ఎదురుగా ఏదో నల్లగా కనుపించింది. అతని హృదయం ఆనందంతో గంతులేసింది. అది ఒక గ్రామం అనుకున్నాడు. గ్రామంలో ఇండ్లగోడలు కనుపిస్తున్నా యను కున్నాడు. కాని ఆ నలుపు కదలడం మొదలెట్టింది. అది గ్రామమూ కాదు; గ్రామంలో ఇండ్లగోడలూ కాదు. మంచులోనుంచి రెండుచేలకు మధ్యగానాటిన సరుకు చెట్ల బారు. తీవ్రంగా వీస్తున్న గాలికి చెట్లబారు అటూ ఇటూ ఊగులాడింది. వాసిలియాండ్రి విచ్ భయంతో కంపించాడు. ఎంచాతనో అతనికే తెలీదు. గుర్రాన్నిం మరింతవేగంగా పరుగెత్తిస్తున్నాడు.

మళ్ళీ ఏదో ముందు నల్లగా కనుపించింది. ఈసారి ఇది తప్పకుండా గ్రామమై ఉంటుందనుకున్నాడు. కాని ఈసారీ అది గ్రామం కాదు. సరుకు చెట్ల వరుసే. ఆ సరుకు చెట్ల వరుసకు ప్రక్కగా ఒక గుర్రం వెళ్ళినదోవ కనుపిస్తోంది.

'ఇలా నశించి పోతానేమో', అనుకున్నాడు. తన భయం కప్పిపుచ్చుకోడానికి గుర్రాన్ని మరీ తీవ్రంగా పరు గెత్తించడం మొదలెట్టాడు. ఒక్కోసారి అతనికి ఎక్కడో కుక్కలు మొరగడం వినిపిస్తున్నట్లనిపించింది. తోడేళ్ళ కూతలు వినిపిస్తున్నట్టు తోచింది. కాని ఆ అరుపులూ కూతలూ చాలా మందంగా వినిపిస్తున్నాయి. అవి నిజమో అబద్ధమో తనే ఊహించుకోలేకపోయాడు. ఆగి ఆ శబ్దాలను శ్రద్ధగా వినడం మొదలెట్టాడు.

హఠాత్తుగా అతని చెవుల దగ్గరగా ఒక భయంకరమైన శబ్దం వినిపించింది. అతను భయంతో గజ గజ లాడిపోయాడు. గుర్రం మెడ గట్టిగా కౌగలించుకున్నాడు. ఆ భయంకరమైన

అరుపు మరీ హెచ్చు కాజొచ్చింది. రెండు నిముషాలు ఏం జరుగుతూ ఉందో అతనే అర్థం చేసుకోలేకపోయాడు. ఆ భయంకరమైనశబ్దం ఆ గుర్రం సకిలింపే. 'అబ్బ! ఎంత భయపెట్టావ్!' అన్నాడు వాసిలియాండ్రివిచ్. కాని అప్పటికీ అతనిభయం చల్లారలేదు.

'కాసేపాగి అన్ని విషయాలూ నిశ్చలంగా ఆలోచించుకుందాం,' అనుకున్నాడు. కాని ఆగలేకపోయాడు. మళ్ళీ ప్రయాణం సాగించాడు. అతని శరీరం చల్లబడిపోతోంది. కాళ్ళూ చేతులూ వణికిపోతున్నాయి. శ్వాస తీవ్రంగా వస్తోంది. ఈ భయంకరమైనమంచు ఎడారిలో తనకు సమాప్తిక్షణాలు సమీపిస్తున్నట్టు అతను గ్రహించాడు. గత్యంతరం కనుపించలేదు.

హఠాత్తుగా అతని గుర్రం జారింది. ఒక మంచు నెరియలో పడింది. వాసిలియాండ్రివిచ్ గుర్రంమీదినుంచి దూకాడు. అతను గుర్రంమీదినుంచి దూకగానే గుర్రం తెంచుకుని పరుగెత్తిపోయింది. అతనొక్కడూ ఆమంచు వరదలో మిగిలిపోయాడు

గుర్రాన్ని పట్టుకోవాలని వెనకాలే పరుగెత్తాడు. కాని ఇరవై అడుగులు వేశేసరికి అలసిపోయి కుప్పకూలాడు. అతని ఆస్తి పాస్తులన్నీ ఒక్కమాటుగా అతనికి జ్ఞాపకం వచ్చాయి. అతని దొడ్లూ— తోటలూ గొడ్డూ గోదా — భార్యా పిల్లలూ— అంతా వదిలిపెట్టి వెళ్ళాల్సిందేనా? అతని మనస్సులో ఇవన్నీ ఒక్కమాటగా ముసురుకున్నాయి.

'ఇది కలా?' అనుకున్నాడు. అది కలో నిజమో తేలీ లేదు. మంచు అతని ముఖాన్ని కొరడాలతో కొడుతోంది.

అతని ముఖాన్నీ చేతులనూ పూర్తిగా కప్పేసింది. ఆ ఎడారిలో అతను ఒంటరిగా మిగిలిపోయాడు. ఇది వాస్తవం. ఇందులో అసత్యం అణుమాత్రంకూడా లేదు. అతనిముందు అర్థరహితమైన మృత్యువు అతన్ని కబళించడానికి కాచుకుని నిల్చున్నది.

అతనికి దేవతలందరూ జ్ఞాపకం వచ్చారు. మహాత్ములు జ్ఞాపకం వచ్చారు. మహాత్ములు చేసే నిర్ణయాలను ప్రార్థించాడు కాని అతన్ని ఆ క్షణంలో ఎవరూ రక్షించేటట్టు కనిపించలేదు. 'నిరాశపడి లాభం లేదు. గుర్రంవెళ్ళిన దోవనే వెళ్ళాలి' అనుకున్నాడు.

ముందు నెమ్మదిగా వెడదామనుకున్నాడు.

కాని తీరా బయలుదేరే సరికి అతని నిశ్చయం సడలిపోయింది. పడుతూ లేస్తూ పరుగెత్తాడు. గుర్రంవెళ్ళిన దోవ మంచులో మాసిపోతున్నది.

'నేను దోవ తప్పుతున్నాను.' అనుకున్నాడు వాసిలి యాంద్రివిచ్. 'దోవతప్పితే గుర్రాన్ని అసలు కనుక్కోలేను,' అనుకున్నాడు. కాని ఆక్షణంలో అతనికేదో నల్లగా కనుపించింది. అది తన గుర్రమే. గుర్రం ఒక్కటే కాదు — గుర్రం పక్కనే బండికూడా ఉంది. గుర్రం ఎప్పటిలాగానే తన యథాస్థానంలో నిల్చుని ఉంది. వాసిలియాంద్రివిచ్ ఇదివరకు నికిటా పడిన మంచు నెరియలోనే పడ్డాడు.

## 9

బండి దగ్గరికి చేరగానే వాసిలియాంద్రివిచ్ బండిని గట్టిగా కరుచుకుని చాలాసేపు అలాగే నిలబడి పోయాడు.

అలుపు తీర్చుకుని కొంచెం స్థిమితత తెచ్చుకోడానికి యత్నించాడు. నికిటా పూర్వపు చోటులో లేడు. బండ్లో పడుకుని ఉన్నాడు. వాసిలియాం[డివిచ్‌కి భయం తగ్గింది. అతనిలో భయం ఏమాత్రమైనా మిగిలి ఉన్నదంటే అది అతను గుర్రంమీద వెళ్ళినప్పుడు కలిగిన అనుభవానికి సంబంధించినదే. ఏమైనా ఏదో ఒక విధంగా అతను భయాన్ని పార[దోలాలి. ఏదో ఒక విధంగా [పొద్దుపుచ్చాలి. ఒక నిమిషం సేదదీర్చుకుని బూట్లకున్న మంచు దులుపుకున్నాడు. అతను బండిదగ్గరికి వెళ్ళి చూచేసరికి బండ్లో ఏదో కదులుతున్నట్లు కనిపించింది. నికిటా తల మంచులోనుంచి కనుపిస్తోంది. సగం గడ్డకట్టుకునిపోయి ఉన్న నికిటా ఎంతో కష్టంమీద లేచాడు. చెయ్యి ఊపుతూ వాసిలియాం[డివిచ్‌ని పిలిచాడు. వాసిలియాం[డివిచ్ బండి దగ్గరికి వెళ్ళాడు.

'ఏమిటి నికిటా? ఏమి టంటున్నావు?' అన్నాడు.

చనిపోతున్నానయ్యా నాకు ఇవ్వాల్సిన బాకీ జీతం నా పిల్లలు కిచ్చెయ్యండి,' అన్నాడు నికిటా.

'గడ్డ కట్టుకుని పోయావా?' అన్నాడు వాసిలియాం[డవిచ్. 'చావు దగ్గరికి వస్తోందయ్యా. నన్ను క్షమించండి,' అన్నాడు నికిటా గద్గద స్వరంతో.

వాసిలియాం[డివిచ్ ఒక్క నిమిషం నిశ్చలంగా మౌనంగా నిల్చున్నాడు. తరువాత ఒక్క అడుగు వెనక్కు వేసి నికిటాను కప్పిన మంచు పెళ్ళగించడం మొదలెట్టాడు. మంచు పూర్తిగా పెళ్ళగించి తన ఉన్నికోటు విప్పి నికిటామీద పడుకుని తన ఉన్ని కోటుతో నికిటాను కప్పేశాడు. అతనికి గాలి హోరు

వినిపించడంలేదు. ఒక్క నికిటా ఉచ్ఛ్వాస నిశ్వాసలుమాత్రం వినిపిస్తున్నాయి. మొదట చాలాసేపటివరకూ నికిటా నిశ్చలంగా పడుకున్నాడు. తరువాత ఒక్కసారి దీర్ఘంగా నిశ్వసించి కాస్త కదిలాడు.

'పడుకో నికిటా నెమ్మదిగా శరీరం వెచ్చబడనీ......' అన్నాడు వాసిలియాంద్రివిచ్.

తరువాత మాట్లాడలేకపోయాడు. అతని కళ్ళవెంట నీళ్లు తిరిగాయి.

'నే నింత బలహీనుణ్ణయి పోయానేమిటి?' అనుకున్నాడు కాని ఈ బలహీనత అతనికి దుఃఖకరంగా లేకపోగా, అతను జీవితంలో ఎన్నడూ ఎరగని ఒక నూతనానందాన్ని కలగజేసింది.

ఇలా వాసిలియాంద్రివిచ్ చాలాసేపు పడుకున్నాడు. అతని కళ్ళవెంట నీళ్ళు కారుతున్నాయి. ఉన్నికోటుతో కళ్ళు తుడుచుకుంటూ పడుకున్నాడు.

తన్ను ఆవరించిన ఆనందమయస్థితిని ఎవరికో ఒకరికి వెలిబుచ్చాలని అతనికెంతో ఆతురతగా ఉంది.

'నికిటా!' పిలిచాడు వాసిలియాంద్రివిచ్.

'ఎలా ఉంది?'

'వెచ్చగా ఉందయ్యా.' వాసిలియాంద్రివిచ్ కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి. అలా చాలాసేపు ఉండిపోయాడు.

వాసిలియాంద్రివిచ్ చేతులూ కాళ్ళూమాత్రం గడ్డకట్టడం మొదలెట్టాయి. కాని అతనికి అవేమీ పట్టలేదు.

నికిటా ఎలా వెచ్చగా ఉంచాలనే విషయంమాత్రమే అతను ఆలోచిస్తున్నాడు.

ఇలా మూడుగంటలు గడిచాయి. అతనికిమాత్రం ఎంతకాలం గడిచిందో తెలీదు. అతని మనస్సులో ఎన్నో జ్ఞాపకాలు రావడం మొదలెట్టాయి. మంచుతుఫాను, బండి వెళ్ళిన దోవలు, అన్నీ అతని మనస్సులో గిర్రున తిరగడం మొదలెట్టాయి. తరువాత అతనికి నికిటా జ్ఞాపకంవచ్చాడు. పండగ, అతిథులు, తన భార్య, కొవ్వొత్తులు, ఎన్నో జ్ఞాపకం వచ్చాయి. తన ఇల్లు, బేరగాళ్ళు, ఇంకా ఎన్నెన్నో దృశ్యాలు జ్ఞాపకం వచ్చాయి.

తరువాత ఈదృశ్యాలన్నీ శూన్యంలో కలిసిపోయాయి. ఇంద్రధనస్సు రంగులన్నీ కలిసి తెలుపులో కలిసిపోయినట్టు ఈ దృశ్యాలన్నీ శూన్యంలో కలిసిపోయాయి. అతను నిద్ర పోయాడు.

ఇలా చాలాసేపు నిద్రపోయాడు. కాని తెల్లవారు ఝామునమాత్రం మళ్ళీ కలలు రావడం మొదలెట్టాయి. అతను కొవ్వొత్తుల పెట్టెపక్కన నిల్చుని ఉన్నాడు. ఒక స్త్రీ అతన్ని కొవ్వొత్తికోసం అడుగుతున్నది. అతను ఒక కొవ్వొత్తి తీసి ఇద్దామనుకుంటాడు. కాని అతని జేబుల్లోనుంచి చేతులు పైకిరావు. పెట్టెచుట్టూ తిరుగుదా మనుకుంటాడు. కాని కాళ్ళు కదలవు. కొవ్వొత్తుల పెట్టె పక్కగా మారుతుంది, అతను పక్కమీద పడుకునిఉంటాడు. పక్కమీదినుంచి లేవలేడు.

కాని అతను లేచి తోటబేరానికి వెళ్ళాలి. తనకోసం ఇవాన్ మాట్విచ్ వస్తాడు.

తన భార్యను 'అతనొచ్చాడా ?' అని అడుగుతాడు.

'అతనింకా రాలేదు?' అంటుంది. వాకిట్లో ఎవరిదో అడుగుల చప్పుడు వినిపిస్తుంది.

'అతనే,' అనుకుంటాడు.

'అతనేనా?' అని అడుగుతాడు భార్యని. 'ఊహుం-కాదు' అంటుంది. అతను పక్కమీదే పడుకుని ఉన్నాడు. కాని లేవలేడు. దేనికోసమో వేచి ఉన్నాడు. ఈ వేచివుండడానికి ఒక అంతూ పొంతూ లేదు కాని అందులో ఒకవిధమైన ఆనందం ఉన్నది. హఠాత్తుగా అతని ఆనందం పరిపూర్ణత పొందుతుంది.

అతను వేచివున్న వ్యక్తి వస్తాడు. కాని అతను మాత్రం ఇవాన్ కాదు. మరెవరో. అతనికోసమే తను ఇంతసేపూ వేచి ఉన్నది. అతను వచ్చి తనను పిలిచాడు. అతనే తనను నికిటా మీద పడుకోమని చెప్పాడు. తనకోసం అతనైనా వచ్చి నందుకు వాసలియాండ్రవిచ్ సంతోషించాడు.

'వస్తున్నాను' వాసిలియాండ్రవిచ్ అరిచాడు ఆనందంతో. ఆ అరుపు అతన్ని లేపింది. కాని అతను నిద్రలేవడం మరో తమనిషిగా నిద్రలేచాడు. అతను లేద్దామనుకున్నాడు కాని లేవలేకపోయాడు. కాలూ చెయ్యా కదపలేకపోయాడు, అతనికి ఆశ్చర్యం వేసింది. కాని గాభరామాత్రం కలగలేదు.

ఇదే మృత్యువని అతను అర్థం చేసుకున్నాడు. కాని అతనికి భయం కలగలేదు. అతనికింద నికిటా పడుకుని ఉన్నాడనీ

వాడు వెచ్చగా బ్రతికేఉన్నాడని అతనికి జ్ఞాపకం వచ్చింది. అతనే నికిటా అయినట్టూ అతని ప్రాణం నికిటాలో ఉన్నట్టూ అతను భావించాడు. ఎంతో కష్టంతో ప్రయత్నించి నికిటా శ్వాస కూడా విన్నాడు. నికిటా కొంచెం గురకకూడా పెడుతున్నాడు. 'నికిటా బ్రతికేఉన్నాడు. నేనూ బ్రతికే ఉన్నాను.' అనుకున్నాడు వాసిలియాంద్రివిచ్.

తనడబ్బు, తనదుకాణాం' బేరాలు, ఆస్తిపాస్తులు, ఇల్లూవాకిలీ ఇవన్నీ జ్ఞాపకం వచ్చాయి. వీటన్నిటికోసం ఎందుకింత తాపత్రయపడ్డానా అనుకున్నాడు

"నిజం తెలీక' అనుకున్నాడు. ఆ పూర్వపు వాసిలియాంద్రివిచ్ వేరయినట్టూ తనువేరయినట్టూ భావించాడు. మళ్ళీ అతనికి ఆ గొంతుక వినిపించింది.

'నేను వస్తున్నాను. వస్తున్నాను.' అన్నాడు: ఆనందంతో. ఆ అపూర్వమైన ఆనందం అతన్ని పూర్తిగా ముంచెత్తింది. అతనికేదో నూతనమైన ముక్తి లభించినట్టు తోచింది.

తరువాత వాసిలి యాంద్రివిచ్‌కి ఏమీ వినిపించలేదు. ఏమీ కనుపించలేదు. ప్రపంచం అస్తమించింది.

చుట్టూ మంచువరద పొంగెత్తుతోంది. మంచు! అదే మంచు! చనిపోయిన వాసిలి యాంద్రివిచ్‌ని, వణికిపోతున్న గుర్రాన్ని బండిని, నికిటాను కప్పేసింది. తన మృతయజమాని కింద నికిటా వెచ్చగా ఉన్నాడు.

# 10

తెల్లవారీవారకముందే నికిటా నిద్రలేచాడు. తెల్లవారు ఝామున చలికి లేచాడు. అతనికప్పుడు ఓ చిన్న కలవచ్చింది.

తను' తన యజమాని పిండిబస్తా తీసుకుని మిల్లునుంచి వస్తున్నట్టూ వాగు దాటుతోంటే తన బండి ఇరుక్కునిపోయినట్టూ కలగన్నాడు. అతను బండికిందదూరి బాడి లేవనెత్తడానికి ప్రయత్నిస్తున్నాడు. కాని విచిత్రం! బాడి కదల్లేదు. అతన్ని అణిచేస్తోంది. ఆబండే అతనిమీాద పడుకునిఉన్న తన మృతయజమాని.

'యాంద్రివిచ్! యాంద్రివిచ్!' అంటూ నికిటా లేచాడు. కాని వాసిలియాంద్రివిచ్ మాత్రం మారుపలకలేదు. అతని కాళ్ళూ చేతులూ కొయ్యముక్కల్లా ఉన్నాయి.

'చనిపోయాడు! స్వర్గధామం చేరుకుంటాడుగాక!' అనుకున్నాడు నికిటా.

కళ్ళు తెరిచి మంచు పెళ్ళగించాడు. తెల్లవారింది. గాలి బండి సందుల్లోనుంచి ఈలలువేస్తూ వీస్తోంది. మంచుకురుస్తూనే ఉంది.

'గుర్రంకూడా గడ్డకట్టుకునిపోయి ఉంటుంది,' అనుకున్నాడు నికిటా.

నికిటాకు తనూ చనిపోతున్నట్టు తోచింది.

'ప్రభూ; నన్నూ పిలుస్తున్నావా?' అన్నాడు. తను చనిపోతున్నాననుకుని కళ్ళు మూసుకున్నాడు.

మధ్యాహ్నమయ్యేసరికి రైతులు వచ్చి వాసిలియాంద్రివిచ్‌ని' నికిటాను మంచులోనుంచి పెళ్ళగించారు.

గుర్రంకూడా మంచులో పూడుకుని చనిపోయింది.

నికిటా ఒక్కడే కొనఊపిరితో ఉన్నాడు. తను బ్రతికి ఉన్నా చనిపోయినట్టే భావిస్తున్నాడు.

కైతులు అరుస్తోంటే అవి మరేదో ప్రపంచంలో అరుపు లనుకున్నాడు. మళ్ళీ ప్రపంచంలోకి వచ్చానని తెలియగానే అతనికి దుఃఖం కలిగింది.

రెండు నెలలు ఆస్పత్రిలో ఉన్నాడు. గడగట్టి చెడిన అతని కాలివేళ్ళు మూడు కోసేశారు. ఎలాగో ఒకలా బ్రతుకు జీవుడా అని ఆస్పత్రినుంచి వచ్చి జీవయాత్ర సాగించాడు. మరో ఇరవై సంవత్సరాలు ఈ లోకంలో బ్రతికాడు. కొన్నాళ్ళు పాలేరుగా, కొన్నాళ్ళు ముసలితనంలో కావలాదారుగా పనిచేశాడు. చివరకు తన ఇచ్ఛానుసారం తన స్వగృహంలోనే ఈశ్వర సాన్నిధ్యంతో శాశ్వతంగా కళ్ళు మూశాడు. తన భార్యను క్షమించాడు. కొడుకు దగ్గరా మనుమళ్ళ దగ్గరా సెలవు తీసుకున్నాడు. వాళ్ళకు తన భారం తప్పిపోతున్నదనే సంపూర్ణ సంతృప్తితో ఈ జీవితంతో అలసి మరోజీవన ప్రాంగణంలో అడుగు పెడుతున్నాననే ఆశతో చనిపోయాడు. అతను చనిపోయిన తరువాత మళ్ళీ పునరుద్ధానం పొందాడో లేదో ఆ జీవితం అతనికి ఎలాఉందో మనకు తెలీదు.

# నెగడి

పూర్వం ఒకప్పుడు ఒకతనికి విశాలమైన ఇల్లు ఉండేది ఆ ఇంట్లో ఒక పెద్ద నెగడి. రష్యాదేశంలో ప్రతి ఇంట్లో ఒక నెగడి వుంటుంది. ఆ నెగడి ఎప్పుడూ వెచ్చగా వుంచుతారు. అప్పుచేసి. ఇంట్లో వాళ్ళందరూ చలికాచుకుంటూ నెగడి దగ్గర కూచుంటారు. ముఖ్యంగా చలికాలంలో ఇది వాళ్ళకెంతో అవసరం ఉంది. అంత పెద్ద పొయ్యి ఆ ఊళ్ళో మరెవరింటి లోను లేదు. కాని అతని కుటుంబం చాలా చిన్నది. అతనూ, అతనిభార్య తప్ప మరెవరూ లేరు.

చలికాలం వచ్చింది, అతను తన పొయ్యిని రాత్రిం బగళ్ళు చల్లారకుండా వుంచాలనుకున్నాడు. ఆ పొయ్యి అంటే అతనికెంతో ప్రేమ. ఇంట్లోవున్న కట్టెలన్నీ ఒక నెలలో కాల్చివేశాడు. ఆ తరువాత పొయ్యిలో పెట్టడానికి ఏమీ కనుపించలే దతనికి. పొయ్యి చల్లారిపోయింది

అప్పుడతను తన ఇంటిచుట్టూవున్న కంచె ఊడపీకి పొయ్యిలో పెట్టడం ప్రారంభించాడు. అలా కంచెపూర్తిగా ఊడపీకేసరికి ఇంటిచుట్టూ ఏమీ అడ్డం లేనందువల్ల చలిగాలి కొట్టి మరీబాధగావుంది. యిక పొయ్యిలో పెట్టడానికి అతని కేమీ కనుపించలేదు.

అప్పుడతను ఇంటిలో కప్పు కొంచెం కొంచెం పెరికి పొయ్యిలో తురమడం మొదలెట్టాడు. పొరుగింటాయన అది చూచి అతనితో ఇలా అన్నాడు. 'ఏమయ్యా! నీకేమైనా పిచ్చిపుట్టిందా ఏం? యింటిలో కప్పు ఊడపీకి పొయ్యిలో పెడతారటయ్యా ? ఎక్కడన్నాయిల్లు కాస్తా అలా పాడు చేసుకుంటే, ఈ చలికాలంలో మీ భార్యాభర్తలు ఎక్కడుంటారు?'

అయినా అతను పొరుగువాడి మాటలు లక్ష్యపెట్టలేదు.

'మరేంకాదు, నా పొయ్యి ఆరిపోకుండా వుండాలి. అందుకని అలా చేస్తున్నాను. నా పొయ్యి సామాన్యమైందా? నీకు తెలీదూ? అది చాల విచిత్రమైనపొయ్యి. అది మండుతూ వున్నకొద్దీ మాకు చలి ఎక్కువౌతుంది. చూచావా మరి తమాషా?' అన్నాడతను పొరుగింటాయనతో.

అతని మాటలకు నవ్వుతూ పొరుగింటాయన ఇలా అన్నాడు.

'అలా అని ఇంటి కప్పు ఊడపీకుతారటయ్యా! ఇవాళలో కప్పు పీకేశావు, రేపు ఇంటి పైకప్పు పీకేస్తావు. అప్పుడెక్కడుంటావు చెప్పు?'

'అవును మరేంచేయను ? అందరికీ కావల్సినంత వంట చెరుకు వుంది. మరి నాకర్మ. నా కర్రియావత్తూ ఒక నెలకూడా రాలేదు. చలికాలం చంపేస్తూవుంది' అన్నాడతను తిరిగి.

'అసలు నీకంత పెద్దపొయ్యి అనవసరం. అది ఎంత కట్టెయినా మింగి ఊరుకుంటుంది. కనుక దాన్ని మార్చి చిన్న పొయ్యి వేయించుకో' అన్నాడు పొరుగింటాయన.

ఆమాట వినేసరికి అతనికి చుర్రుమంది.

'అవును, నాకు తెలుసు మీరందరూ నాపొయ్యినిచూచి కుళ్ళుకుంటున్నారు. అంతపొయ్యి ఈ ఊళ్ళో మరెవరికీలేదు. అదీ మీ కడుపుమంట. దాన్నేలాగైనా పాడుచేయాలని మీకు బుద్ధిపుట్టింది. అది పాడైతేగాని మీ కళ్ళు చల్లబడవు' అంటూ ఆతను పొరుగింటివానిమీద విరుచుకపడ్డాడు.

ఆవిధంగా అతను అందరిమాటా పెడచెవినిపెట్టి ఇంటి లోకప్పూ, ఆతరువాత ఇంటి పైకప్పూ ఊడబెరికి తన ప్రియమైన పొయ్యిలో తురిమాడు.

ఆతరువాత ఇంకేముంది ? నిరాధారం. ఎముకలుకొరికే చలిలో ఆ భార్యాభర్తలిద్దరికి నిలువ నీడలేకపోయింది. చివరకు వాళ్ళు ఎవరిపంచకో వెళ్ళి తల దాచుకోవాల్సివచ్చింది.